ఆంధ్రపత్రిక

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 17 MONDAY 18th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao



# పాకిస్థాన్ ఉల్లంఘనలఎడ భారతదేశం ఔదాసీన్యం వహించరాదు

## కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా హెచ్చరిక

### చిన్న సంఘటనలే సంఘర్షణకు దారితీయవచ్చును

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: "భారతదేశంగాని, కాశ్మీర్ గాని, ఏమీ భయంలేదని ఔదాసీన్యం వహించకూడదు. ఏదైనా జరుగ వచ్చును ఇపుడు జరిగే చిన్న సంఘటనలే పెద్ద సంఘర్షణలకు దారి తీయవచ్చును." అని పాకిస్థాన్ యుద్ధ విరమణ చేసినదను విషయముపై పత్రికావిలేఖరుల సమావేశములో నేడు కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా తెలియజేసెను.

యుద్ధ విరమణను కాశ్మీర్ కమీషను సమర్పించిననూ తన ప్రతిపాదనలకు భారతదేశ సమాధానము సోమవారమునాటికి సిద్ధము కాగలదని చెప్పెను.

కాశ్మీర్ యుద్ధ విరమణ ఒడంబడికను పాకిస్థాన్ మాటిమాటికీ ఉల్లంఘించుటపై కాశ్మీర్ కమీషనకు, పాకిస్థానుకుకూడ ఆక్షేపణ తెలియచేయబడినట్లు కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా నేడు పత్రికా విలేఖరులతో మాట్లాడుచు వెల్లడించెను.

పాకిస్థాన్ నుండిగాని, కమీషన్ నుండిగాని ఇంతవరకూ ఎట్టి సమాధానము రాలేదనికూడ ఆయన చెప్పెను. ఆయన ఇంకను ఇట్లు చెప్పెను:

యుద్ధ విరమణ ఒడంబడికను పాకిస్థాన్ ఇంతవరకూ 50,60 సార్లు ఉల్లంఘించినది. తమ స్థానమును బలపరచుకొనుటకు పాకిస్థాన్ ఇటీవల తమ సేనలను ముందుకు కదలించిందికూడాను ఒడంబడిక జరిగినప్పుడు భారతసేనలు కొన్ని పర్వత శిఖరముల నుండి క్రిందకుదిగి వచ్చివేసినవి. ఈ శిఖరములు మన సేనలకు చాల ముఖ్యమైనవి. వాతావరణము చక్కబడగానే, పాకిస్థాన్ సేనలు ఆ శిఖరములను పునరాక్రమించుకొన యత్నించినవి. కొన్నిటి నప్పుడే వారాక్రమించిరికూడాను. పాకిస్థాన్, భారతసేనలకు మధ్య కొంత ఎవరికీ చెందని ప్రదేశమున్నది. అది క్రమముగా పాకిస్థాన్ వశమగుచున్నది"

ఒక ప్రశ్నకు సమాధానముగా షేక్ అబ్దుల్లా ఇట్లు చెప్పెను: "పాకిస్థాన్ తిరిగి విరోధమును ప్రబలింప గోరుచున్నదేమో నేను చెప్పలేను. ఏమైనా మనము నిర్లక్ష్యముగా ఊరకొనరాదు. ఏదైనా జరుగ వచ్చును. ఇప్పుడు జరిగే చిన్న చిన్న సంఘటనలే పెద్దవాటికి త్రోవ తీయ వచ్చును. నిర్లక్ష్యము చేయరాదనగా, మనము మన సరిహద్దుల కాపాడుకోవలెనని నా భావము. అతిని పైవారు మన ఎల్లను దాటివచ్చి భద్రతను భంగము చేయుదురు. దీనిని మన మరికట్టవలెను. కాని మన సరిహద్దును దాటి మాత్రము మనము పోరాము.

ఏ అధినివేశములో చేరవలెనన్నది ప్రజలే నిర్ణయించవలెనని మనము ఆది నుండీ చెప్పుచున్నాము. కాని ఆ నిర్ణయము ఎట్లు జరుగవలెనన్నదే ప్రశ్న. అట్టి నిర్ణయమునకు అనువైన పరిస్థితులు కల్పింప ... జనవాక్య నిర్ధారణ జరుగుటకు ... పారిపోయిన శరణార్థు లందరూ తిరిగి రప్పింప బడవలెనని పాకిస్థాన్ చెప్పినమాటను మన మంగీకరించితిమి. కాని శరణార్థులకు పునరావాస మెట్లు కల్పింపబడగలదు? వారికి ధైర్య మెట్లు పురికొల్ప బడగలదు? ఇవన్నియు చేయవలసిన బాధ్యత పాకిస్థాన్ దే"

జనవాక్య నిర్ధారణలో ఏవేవి విషయములిమిడియున్నవని ప్రశ్నింపగా, "కాశ్మీర్ ఇండియాలో చేరినా, పాకిస్థానులో చేరినా ... ఒక్కటే ... "చుట్టూ ఉన్న పెద్ద రాజ్యములు సమ్మతి లేనిదే కాశ్మీర్ స్వతంత్రముగా ... అంగీకరింపదు" అని షేక్ అబ్దుల్లా జవాబు చెప్పెను.

(2-వ పేజీ చూడుడు)

# మహాత్ముని స్మారకచిహ్నం లెనిన్, లింకన్ చిహ్నాలనుపోలియుండును

—కాకా కలేల్కర్

రాజకోట, ఏప్రిల్ 16: "నిర్మాణ కార్యక్రమమును దీక్షగా కొనసాగించుటయే గాంధిమహాత్మునికి శ్రేష్ఠమైన స్మారక చిహ్నముగా నుండును. మహాత్మ గాంధి స్మారక కమిటీ ఆశయము నిర్మాణ కార్యక్రమమును సాగించుటయే." అని చిరకాలము మహాత్మునితో కలిసి పని చేసిన కాకా కలేల్కరుగారు నిన్న ఇచ్చట ప్రకటించిరి. గాంధిమహాత్ముని స్మారక చిహ్నమునకై విషయజాలమును సేకరించుటకు కాకా కలేల్కరుగారు గాంధి స్మారకసంఘుపక్షమున సౌరాష్ట్రములో పర్యటించుచున్నారు. గాంధి మహాత్ముని జీవితమునకును, ప్రపంచ శ్రేయమును దృష్టిలో నుంచుకొని ఆయన అవలంబించిన సిద్ధాంతములకును సంబంధించిన వివరములతో ప్రారంభించి, అల్పమైనవైనప్పటికీ, అత్యంత అర్థవంతమైన ఈ వివరములలో ప్రారంభించి ఆయన స్మారక చిహ్నమును నెలకొల్పుట సంఘమువారి ఆశయమని కలేల్కరుగారనిరి.

మూడు సంవత్సరములలో తాను తన పనిని పూర్తిచేయ ఆశించుచుండెనని చెప్పుచు కలేల్కరుగారిట్లనిరి:

"లెనిన్, అబ్రహాంలింకన్, లారు నెల్సనులకు ఎట్టి ఘనమైన స్మారక చిహ్నము నెలకొల్పబడెనో, అట్టి స్మారక చిహ్నమును సంఘమువారు ఏర్పరి చెదరు. మహాత్మగాంధి స్మారకచిహ్నము వారు మే 7 వ తేదీన ఢిల్లీలో వివిధ స్మారకస్థానములను నిర్ణయించెదరు." గాంధిమహాత్ముడు తన జీవితకాలములో ఎప్పుడైనను సరే ఉపయోగించుచుండిన అన్ని వస్తువులను సంఘమువారు సేకరింప దలచుచున్నారు. వానిని ఒక చిత్ర వస్తు ప్రదర్శనశాలలో నుంచ దలచుచున్నారు. గాంధిమహాత్ముని లేఖలు, ముఖ్యముగా వ్యక్తుల పైనంజిన సమస్యలకు సంబంధించినవి గాంధీజీ కార్యకలాపములలో ప్రాధాన్యము వహించుచుండెను. ఆయన వ్యక్తిత్వమును సంపూర్ణముగా ఆవిష్కరించుటకు అవి సహకారులుగా నుండును. సాధారణ లేఖలకు నకళ్లు తయారు చేయుదురు. ముఖ్య లేఖల ఛాయాపటములు తీసి జాతీయపత్ర, భాండాగారాలలో నుంచెదరు. గాంధిమహాత్ముని రాజకీయ, సాంఘిక కార్యకలాపములతో సంబంధము కలిగియుండినట్టియు, చారిత్రిక ప్రాముఖ్యం కలిగియున్నట్టి స్థలములను కమిటీవారు స్వాధీనము చేసికొనదలచుచున్నారు. గాంధిమహాత్ముని వాణి, రికార్డింగులను, ఆయన జీవితకాలములో ప్రత్యేకతని ఆయన దేశముల ప్రజలస్థితిని ప్రతిబింబింపజేయు వివిధ జానపదగీతములను సంఘమువారు రక్షించదలచుచున్నారు. గాంధిమహాత్ముని ఆశయములను, భారతదేశమునందు, విదేశములలోను వ్యాపింప జేయుటకుగాను పఠనమందిరములను నెలకొల్ప సంఘము వారు సంకల్పించుచున్నారు. గాంధి మహాత్ముని సిద్ధాంతములను తెలిసికొన విదేశములవారు ఆసక్తులై యున్నారు. ఆయన సిద్ధాంతములనుగూర్చి పలువురు ప్రశ్నించుచున్నారు."

గత ఆదివారము గవర్నరు జనరలు రాజగోపాలాచారిగారు పరిషత్తు సభ్యులకు అల్పాహారవిందు చేసిరి

# మలయాకు 5 సంవత్సరాలరక్షణప్రణాళిక

## తయారుచేయ బ్రిటన్ సంకల్పం

మదరాసు, ఏప్రిల్ 17: మదరాసు లెజిస్లేచర్ కాంగ్రెసుపార్టీ ఏప్రిల్ 21 న సా 5-30 గంటలకు రాజాజీ హాలులో 1949-50 సం॥ మునకు కార్యనిర్వాహకులను ఎన్నుకొను నిమిత్తం సమావేశమునని ప్రకటించబడినది.

సింగపూర్, ఏప్రిల్ 16: అగమం మరి పదిసంవత్సరాలవరకైనా బ్రిటిష్ సైన్యాలు మలయా, సింగపూరుల రక్షణ బాధ్యతను నిర్వహిస్తాయి. ఇక్కడి పరిస్థితి తీవ్రంగా ఉండడంచేతనూ, ఉత్తర సయాం, ఇండోచైనాలలో కమ్యూనిస్టుల బలం అధికం కావడంచేతనూ మలయా, సింగపూరు ద్వీపాలలో అయిదు సంవత్సరాల ప్రణాళిక నొకదానిని సత్వరమే ప్రవేశపెట్టడానికి బ్రిటిష్ మంత్రివర్గపు ఆమోదంతో యుద్ధ కార్యాలయము, వివాన మంత్రిశాఖలు నిశ్చయించాయి.

పదిసంవత్సరాలవరకు ఈ ప్రణాళిక విస్తరింపబడవచ్చును. ఈ ప్రణాళికను సరించిన విషయాలను సైన్యాధికారులు ఇప్పటివరకురహస్యంగా ఉంచుతున్నారు. కాని బ్రిటిష్ యుద్ధ మంత్రి, షిన్వెల్ గారు త్వరలోనే కామన్సుసభలో దీనిపై ఒక ప్రకటనను చేయవచ్చును.

ప్రస్తుతం మలయా, సింగపూరులలో

(2-వ పేజీ చూడుడు)

# రిపబ్లికన్ ప్రభుత్వ పునరుద్ధరణ విషయమై బటేవియాలో చర్చలు

## సామరస్యసంఘ అధ్వర్యాన ఇండొనీషియా సమస్యా పరిష్కారానికి ఇరుపక్షాలసంప్రతింపులు

బటేవియా, ఏప్రిల్ 16: ఇండొనీషియా సామరస్య సంఘపు ఆధ్వర్యంక్రింద జరిగిన రెండవ డచ్చి-రిపబ్లికన్ సమావేశానంతరం రిపబ్లికన్ ప్రతినిధి వర్గమందలి ముగ్గురు ప్రముఖ సభ్యులు నేడు బంకానీవికివిమానములో వెళ్ళిరి.

వీరు మాజీ రిపబ్లికన్ హోంశాఖా మంత్రి మహమ్మద్ రూము, డా॥ అలీశాస్త్ర అమీజయో, డా॥ యుహాన్నద్ అనువారు. వీరితో ఇటీవలనే లేక్ సక్సెస్ నుండి తిరిగివచ్చిన సుదర్శి శాస్త్ర అసత్ మయెకూరా ఉన్నారు.

జోగ్జకర్తాలో రిపబ్లికన్ ప్రభుత్వమును పునః ప్రతిష్ఠించు విషయమై చర్చలు జరిగెనని నేడు అధికారరీత్యా ప్రకటింపబడెను.

లేక్ సక్సెస్ లో ఇటీవలఇండొనీషియా సమస్యపై జరిగిన తాజా పరిణామములను, డా॥ సుకర్నో ప్రభృతుల కెరిగించుటకై సుదర్శి బంకాలవికి వెళ్లుచున్నారు.

ప్రపంచాభిప్రాయమును జాగ్రత్తగా గమనించుచు నడచుకొనుచున్న రిపబ్లికనులపై లేక్ సక్సెస్ పరిణామాలు చాల ప్రభావమును చూపించగలవు.

వచ్చేమంగళవారం నాడు తిరిగి జరుగబోయే డచ్చి—రిపబ్లికన్ సమావేశ సమయానికి అందుకొనే ట్లుగా నేడు బంకా వెళ్లిన ముగ్గురు రిపబ్లికనులు తిరిగి బటేవియా రాగలరు.

ఇండొనీషియాలో సత్వరమే యుద్ధ విరమణ ఒడంబడిక జరుగవలెనని ఇండొనీషియా కమీషన్ అధ్యక్షుడు మెర్లీకొక్రన్ (అమెరికా) ఏప్రిల్ 14 వ తేదీన మొదటి సమావేశానికి ప్రారంభోపన్యాసం చేస్తూ అన్నాడు, మెర్లీ కొక్రన్ అన్నమాటలలో అమెరికన్ విదేశాంగశాఖ వైఖరి ధ్వనిస్తున్నదని కొందరు పరిశీలకులు భావించుచున్నారు.

ప్రస్తుత చర్చలలో చేయబడే నిర్ణయములు జోగ్జకర్తాలో రిపబ్లికన్ ప్రభుత్వము తిరిగి నెలకొని, పనిచేయుట మొదలిడిన తరువాత రిపబ్లికన్లచే ఆమోదింప బడవచ్చునని కూడ కొక్రన్ సూచించెను.

యుద్ధ విరమణపైన, రిపబ్లికన్ ప్రభుత్వ పునస్స్థాపనపైన అంగీకారం కుదిరితే, ఈ చివ్వవారు హేగ్ లో జరుపదలచిన రౌండు టేబిలు సమావేశమునకు పెద్ద అడ్డంకొలగనని కొక్రన్ చెప్పెను.

కాని డచ్చివారు రిపబ్లికన్ పునఃప్రతిష్ఠాపనపై తాము మాటఇచ్చేముందు యుద్ధ విరమణ, రౌండు టేబిల్ సమావేశము జరిగి తీరవలెనని కోరుచున్నారు.

## "ఇంతఘనమైన చెక్కును నేనింతవరకు చూడలేదు"

—నెహ్రూ.

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: గాంధి జాతీయ స్మారక నిధి వసూలు చేయుటకు ఏర్పడిన పారిశ్రామికుల సంఘము నేడు సర్దార్ వల్లభాయి ఇంట సమావేశమైనపుడు, నిధి అధ్యక్షుడు డా॥ రాజేంద్ర ప్రసాదుకు రు. 5,07,51,151/-కు చెక్కులను సమర్పించిరి. వాటిలో రు. 4,40,70,560/-కు ఒక చెక్కు ఉన్నది. పండిత నెహ్రూ ఆ చెక్కును చూచి, "ఇంత ఘనమైన చెక్కును నేనెపుడూ చూడలేదు" అనెను. ఒక్కసారి ఇంత పెద్ద మొత్తం రావటం ఇదే మొదటిసారి అని రాజేంద్ర ప్రసాద్ గారనిరి.

## హిమగిరి శృంగంపై శాస్త్రపరిశోధనాలయం

### స్థలాన్వేషణకు శాస్త్రజ్ఞుల రెండవబట్టు ప్రయాణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: హిమవత్ పర్వతాగ్రంపై బహుళ ప్రయోజనకారియగు శాస్త్రీయ పరిశోధనాలయమును నెలకొల్పు నిమిత్తం, అనువైన గిరి శిఖరమును అన్వేషించుటకు, ఈ వేసవిలో, భారతీయ శాస్త్రజ్ఞుల రెండవబట్టు, హిమవత్ పర్వతయాత్రకు బయలుదేరుచున్నది. భారత ప్రభుత్వమే యీ శాస్త్రజ్ఞుల అన్వేషణ యాత్రను ఏర్పాటుచేసినది.

14 లేక 15 వేల అడుగులఎత్తున 10 ఎకరము సమతలంగల కొండ శిఖరం వెతికి దానిపై పరిశోధనాలయం నెలకొల్పవలెనని వీరి సంకల్పం.

## ఆంధ్రకాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

ఏప్రిల్ 16: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం లోగడ నిర్ణయించినట్లు 22 వ గాక, 24, 25 తేదీలలో విజయవాడలో (ఆంధ్ర రత్న భవనంలో) జరుగునని, రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుని సలహాప్రకారం యీమార్పు చేయబడెనని కార్యదర్శి కందుల శివులరెడ్డి గారు ప్రకటిస్తున్నారు.

# ఆసియాలో కమ్యూనిజం ప్రతిఘటనకు అమెరికా, బ్రిటనుల సహాయమవసరమని వుడ్రో వియాట్ విజ్ఞప్తి

లండన్, ఏప్రిల్ 16: ప్రాగ్దక్షిణ ఆసియాలో కమ్యూనిస్టు ప్రాబల్యమును అరికట్టవలెనంటే, ఇండియా, బర్మా, మలయాలకు బ్రిటన్ అమెరికా తక్షణమే ధన సహాయం చేయవలెనని బ్రిటిషు పార్లమెంటులో కార్మిక పక్ష సభ్యుడైన వుడ్రో వియాట్ "న్యూస్ ఆఫ్ ద వరల్డ్" అను పత్రికలో విజ్ఞప్తి చేసెను.

వుడ్రో వియాట్ ప్రాగ్దక్షిణ ఆసియాలో రెండునెలలపాటు సంచారంచేసి ఇటీవలనే లండనుకు తిరిగివచ్చిరి.

డచ్చివారిచేత ఇండొనీషియాకు బలాత్కారంగానైనా స్వాతంత్ర్యం ఇప్పించవలెననికూడా వుడ్రో వియాట్ కోరెను.

ప్రాగ్దక్షిణ ఆసియాలో స్థిరమైన ప్రభుత్వంగల దేశం ఇండియా ఒక్కటే. ఆసియాలో కమ్యూనిస్టుల పురోగమనమును నిరోధించుటకు, మార్షల్ ప్లాను వంటి ప్లాను ఇంకొకటి వేయడం ఒక్కటే ఉపాయం.

ప్రాగ్దక్షిణ ఆసియా అంతటా ప్రభుత్వములను కూలద్రోసి సంక్షోభములను లేవదీయుటకు కమ్యూనిస్టులు విశ్వప్రయత్నము కావించుచున్నారు; ఈ అరాచకములో నుండి కమ్యూనిస్టు ప్రభుత్వములు ఉద్భవించగలవని వారి ఆశ. ప్రాగ్దక్షిణ ఆసియాకు ఆర్థికసహాయం చేయవలసినబాధ్యత అంతా అమెరికా ఒక్కరే నెత్తిన వేసుకొనవలెనని నేను చెప్పుటలేదు. ఇక్కడి వ్యవహారములు బ్రిటన్ కు ఎంత ప్రధానమో అమెరికాకూ అంత ప్రధానల కొబట్టి ఉభయములూ ఈ బాధ్యతను పంచుకోవలెను.

మొదట, డచ్చివారిపైనాంక్షలు ప్రయోగించయినా ఇండొనీషియాకుస్వాతంత్ర్యం ఇప్పించవలెను. తర్వాత, మారిపోతున్న బర్మాప్రభుత్వమునకు బ్రిటిషుకామన్వెల్తు 8,4 ఏళ్ళపాటుఆర్థిక సహాయంచేసి నిలవబెట్టుటకు ప్రయత్నించవలెను. మలయాను బ్రిటిషు ప్రభుత్వం పునరుద్ధరించవలెను. ఇండియాలో పేరుకొనివున్న దారిద్ర్య పంకిలంలో కమ్యూనిజమ్ ఉద్భవించడానికి తగిన బీజం ఏర్పడే వున్నది. ఇండియాకు ఈ దారిద్ర్యపంకిలమును తుడిచి వేయడానికి కావలసిన సహాయము అంతా బ్రిటన్ అమెరికాలే చేయవలెను.

## డిమిట్రాఫ్ బర్తరఫ్ ఆంతర్యం

### టిటోతో సమాధాన పడాలని రష్యాకోరిక

ప్రాగ్, ఏప్రిల్ 16: యుగోస్లావియాతో వివాదమును పరిష్కరించుకొనే అభిలాషతో రష్యా తీసుకొన్న మొదటి చర్య బల్గేరియా ప్రధాని, డిమిట్రోవ్ ను తొలగించడం.

మార్షల్ టిటోకు వ్యతిరేకంగా కోమిన్ ఫారమ్ సాగిస్తున్న ప్రచార యుద్ధం తగ్గలేదు. మార్షల్ టిటో తొలగింపబడతాడనే ఆశ లేకుండా కమ్యూనిస్టు శిబిరంలో జరుగుతూన్న పోరాటాన్ని ఇప్పటి ప్రపంచపరిస్థితి ననుసరించి నిలుపుచేయాలని రష్యాకోరుతున్నది. ప్రతిష్ఠ కారణాలవల్లనే డిమిట్రోవ్ గారు తొలగించబడ్డారు.

యుద్ధం ముగిసిననాటినుండి డిమిట్రోవ్, మార్షల్ టిటోగారల మధ్య తీవ్రమైన వైరుధ్యమున్నది. తూర్పు యూరోపుసమాఖ్యకు నాయకత్వం వహించాలని వీరిరువురు ప్రయత్నించారు.

—గ్లోబ్.

## ఇండియా–దక్షిణాఫ్రికా వివాదం: బాటంలీ సలహా

లండన్, ఏప్రిల్ 16: బ్రిటిష్ విదేశ వ్యాపారమంత్రి ఆర్థర్ బాటంలీ నేటి రాత్రి లండన్ విమానాశ్రయమునుండి న్యూయార్కుకు బయలుదేరెను. ప్రస్తుతం లేక్ సక్సెస్ లో ఐక్యరాజ్య సమితిలో బ్రిటిష్ ప్రతినిధివర్గముగా ఉన్నవారిని ఈయన కలుసుకొనును. ఇండియా, దక్షిణాఫ్రికా వివాదంలో తాను ఉభయపక్షీయులకు సలహాదారుగా పనిచేసెదనని ఈయన వెల్లడించెను. తాను సలహాఇవ్వటమే కాని మధ్యవర్తిత్వం చేయబోవటంలేదని ఆయన తెలియజేసెను.

# పరిషియాలో అమెరికన్ సైనికాధికారులు

## రష్యా అధిక్షేపణకు అమెరికా జవాబు

వాషింగ్టన్ ఏప్రెలు 16: అమెరికాలో వాషింగ్టను నగరమందున్న పరిషియా రాయబారి కార్యాలయమునందలి అధికారి ఒకరిట్లు చెప్పిరి. అమెరికను సైనికాధికారుల రాయబారవర్గ మొకటి పరిషియాలో మకాము చేసియున్నదని యు ఆరీతిగా యుండకూడదనియు రష్యాప్రభుత్వము అధిక్షేపించే రీతుల అట్టి విషయము గూర్చిన ఫిర్యాదులను అయిక్యరాజ్యసమితికి దాఖలు చేసికొనవలెను. రష్యాకు, పరిషియాకు 1921 సం॥లో ఒక ఒడంబడిక వ్రాసికోబడెను. ఈ ఒడంబడిక ప్రకారముగా కొన్ని సందర్భములలో రష్యాను సైనికాధికారులను పటాలములను పరిషియాకు పంపవచ్చును కాని అయిక్యరాజ్య సమితియొక్క ప్రణాళిక ప్రకారముగా అన్యరాజ్యాలు దండెత్తుటకు సిద్ధమై బెదరించుచున్నప్పుడు ఆ విషయములను గూర్చి అయిక్యరాజ్య సమితికి నివేదించి ఫిర్యాదు చేయవలెను. కనుక అయిక్యరాజ్యసమితి ప్రణాళిక మూలముగా 1921 సం॥ నాటి ఒడంబడిక రద్దు చేయబడినదగుచున్నది.

1921 సం॥ ఒడంబడిక ప్రకారం గా అయినప్పటికీ పరిషియాలో ఏ యితరరాజ్యమువారైనను సైనిక స్థావరములను ఏర్పాటుచేసికొనేయెడల అట్టి అనకారమును నడుపు అన్యరాజ్యమునకు యిచ్చినా ననని పరిషియా ప్రభుత్వమును రష్యా కోరేయెడల అట్టి ఉపద్రవమును పరిషియా తనంతటతాను నివారింపజాలని యెడల, అట్టి సందర్భములో రష్యా ప్రభుత్వం తన సేనలను పరిషియాలోనికి పంపవచ్చును. ఈమేరకు 1921 సం॥పు రష్యా పరిషియా ఒడంబడికలోని 6 వ క్లాజులో కలదు.

కాని, అయిక్యరాజ్యసమితి ప్రణాళికలోని 103 నిబంధనయందు యీ క్రిందిరీతిగా కలదు. అయిక్యరాజ్యసమితిలో సభ్యత్వంగల రాజ్యాలకు యిదివరలో ఏర్పడియున్న ఒడంబడికలలోని షరతులకున్నూ ఈ అయిక్యరాజ్యసమితి నిబంధనలకున్నూ పరస్పర వైరుధ్య మేర్పడిన యెడల అట్టి సందర్భములో అయిక్యరాజ్యసమితి నిబంధనలే అమలులోనుండి వర్తించగలవు గాని ఆయా రాజ్యాల ఒడంబడిక షరతులు కావు.

## జపాన్ పై అమెరికా అధ్వర్యం

వాషింగ్టన్, ఏప్రిల్ 17: జపాన్ పరిపాలనను సైనికశాఖ దగ్గరనుండి అమెరికా ప్రభుత్వశాఖ తానే వశపరచుకొనవలెనని ఆలోచిస్తున్నట్లు యునైటెడ్ ప్రెస్ కు తెలుస్తున్నది. ఇంతకుముందు జర్మనీ పరిపాలనకూడా ఇదేవిధంగా సైనికశాఖ నుండి ప్రభుత్వశాఖ స్వాధీనం చేసుకొనటం జరిగినది.

# గాంధి స్మారకనిధికి పారిశ్రామిక సంఘంద్వారా రు. 5 కోట్లు వసూలు

## ప్రజలజీవిత ప్రమాణాన్ని వృద్ధిచేయడమే తమ ఆశయమని కస్తూర్భాయ్ లాల్భాయ్ ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: మహాత్మాగాంధి జాతీయ స్మారక నిధి వసూలుచేయుటకు ఏర్పడిన పారిశ్రామికుల సంఘము నేడు సర్దార్ వల్లభాయ్ పటేల్ భవనములో సమావేశమై జాతీయ స్మారకనిధి అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాదుగారికి 5,07,51,151 రూపాయలకు చెక్కులను సమర్పించిరి. ఇందులో ఒక చెక్కు 4,40,70,560 రూపాయలకు ఉంది. ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఈ చెక్కునుచూచి "ఇంత ఘనమైన చెక్కును నే నిదివర కెన్నడూ చూడలేదు" అన్నారు.

ఈ చెక్కులను బన్ రజితపాత్రలో ఉంచి సంఘ అధ్యక్షుడు శ్రీ కస్తూరిభాయ్ లాల్భాయ్ రాజేంద్రప్రసాద్ గారికి అందచేశారు. ఈ మొత్తం వసూలులో ఎక్కువ ప్రోత్సాహాన్ని చూపిన శ్రీ జి. డి. బిర్లాను రాజేంద్రప్రసాదు, సర్దార్ వల్లభాయ్ పటేల్ కొనియాడారు.

కస్తూరిభాయ్ లాల్భాయ్ గారు పారిశ్రామిక సంఘ అవతరణ, ఆ సంఘం చేసిన కృషిని ఈ విధంగా వివరించారు.

"సర్దార్ వల్లభాయ్ పటేల్ గత సంవత్సరం మే మాసంలో ముస్సోరిలో ఆరోగ్యాన్ని కోలుకుంటూ వున్నప్పుడు వారు మహాత్మాగాంధి జాతీయ స్మారక నిధికి డబ్బు వసూలు చేయడం గురించి చర్చించే నిమిత్తం పారిశ్రామికులను సమావేశపరచినారు. ప్రతిఒక్కరూ తమ నికర ఆదాయంలో 10 రోజుల ఆదాయాన్ని ఈ నిధికి ఇవ్వాలని రాజేంద్రప్రసాదు గారు ఒక సూచన చేశారు. ఈ లెక్క ప్రకారం దేశంలో సంఘటితమైన పరిశ్రమల నుండి 1947 ఆదాయం మేరకు నిధికి సుమారు ఒకటిన్నరకోటి రూపాయలు మాత్రమే లభించేది. కాని పరిశ్రమలు అయిదుకోట్ల రూపాయలు గాంధిజీ నిధికి ఇవ్వాలని సర్దార్ పటేల్ అభిమతం. ఈ విధంగా చూస్తే పరిశ్రమలు ఒక నెల నికరాదాయాన్ని చెల్లింపవలసి ఉంటుంది. ఆ ప్రకారంగా ఈమొత్తాన్ని వసూలు చేయడానికి పారిశ్రామికుల సంఘం పూనుకున్నది. వసూళ్లు ఇంకా జరుగుతూ ఉన్నవి. మొత్తం అయిదుకోట్ల పైన యాభై లక్షలు వసూలు కాగలవు. పారిశ్రామికులు యావన్మందీ ఉత్సాహంతో విరాళాలు ఇచ్చారు. భారత, బ్రిటిష్ కంపెనీలు అన్నీ ఒకే విధంగా ఈ విజ్ఞప్తికి జవాబిచ్చెను. ఈ వసూలుపనిలో ఘనశ్యామదాస్ బిర్లా ఎక్కువ ఉత్సాహంతో పనిచేశారు. ఇంత ఎక్కువ మొత్తం వసూలు కావడానికి వీరి కృషే కారణం. కేంద్రకార్యాలయం క్రింద 17,140 రూపాయలు ఖర్చు అయింది. ఈ ఖర్చు ఒక లెక్కలోనిది కాదు. ఇంతవరకు విరాళాలు ఇచ్చినవారి సంఖ్య 2,200. ఈనాటి వరకూ కేంద్రసంఘం పంపిన టెలిగ్రాములుగాని, ఉత్తరాలుగాని మొత్తం 17,900.

"తమ బాధ్యతను గుర్తించక సవ్యంగా పనిచేయని వ్యక్తులు బహు అరుదు. ఎవరినీ నిర్బంధించి వసూలు చేయడానికి మాకేమీ అధికారాలు లేవు. ఉన్న ఒక్క శక్తి, నైతికశక్తి. అను కొన్న మొత్తం వసూలైంది గనుక మా ప్రయత్నం సంపూర్ణ విజయాన్ని పొందిందని చెప్పడానికి చాలా సంతోషిస్తున్నాను. మొత్తం వసూళ్ళు ఈ మొత్తాన్ని మించిపోగలవు. ఇప్పటివరకు విరాళాలివ్వని వారందరికి ఒక విజ్ఞప్తి చేయుచున్నాను. ఇటీవల మన భారతదేశ ఇతిహాసంలో యిట్టి అద్వితీయమైన, అపూర్వ ఉద్యమము మరొకటి లేదు. కనుక ఇట్టి మహోద్యమమునకు విరాళముల నివ్వవలసినదిగ వారిని కోరుచున్నాను.

"జనుము పరిశ్రమలవారు స్మారకనిధి అధ్యక్షుని అనుమతిపై తమ విరాళములలో మువ్వాతిక మొత్తమును కలకత్తాలో పేదలకు చికిత్సా సౌకర్యముల కల్పించు నిమిత్తం ఒక వైద్యశాల నిర్మాణమునకు వినియోగింపవలసి. ఈ మొత్తానికి యింకనూ చేర్చి ప్రకృతిచికిత్సాలయమును మొదటితరగతి చికిత్సాలయముగ చేయవలెనని వారి సంకల్పము. "గాంధి స్మారక చికిత్సాసదనం" అని దీనికి నామకరణం చేస్తారు.

కస్తూర్బా గాంధికి పారిశ్రామికులు ఇచ్చిన విరాళాలను గురించి మాట్లాడుతూ, అప్పట్లో గాంధికి శ్రీ బాపూజీ వ్రాసిన లేఖనుండి ఈ విషయాలను ఉదహరించినారు: "ఈ నిధి నిర్వహణ వ్యవహారం అంతా ఆచరణలో నేను ఎన్నిన ధర్మకర్తల పరంగానే ఉండాలి" అన్న భావాన్ని మనస్సులోకి రానిచ్చి అపరాధినైనా నన్న విషయం నాకు తెలుసును. అయితే ఎలాంటి అక్రమవ్యవహారం జరుగడానికి అవకాశం లేకయుండే నేను నా తప్పును గ్రహించినాను. నాన్ని

నిరించి ఆలోచించిన కొద్ది అలాంటి శ్వాసలోని సంకుచితత్వాన్ని ఎక్కువగా గ్రహింప కలుగుచున్నాను. ధర్మకర్తల సంఘమునుంచి సమ్మేళనం. ధర్మకర్తలలో ఎక్కువమంది ఉత్సాహంతో ఈ పనిలో పాల్గొంటే మనం ఊహించి ఉండనటువంటి లాభదాయకమైన ఫలితాలు ప్రాప్తింపవచ్చును. పట్టణంలోని పైవారు, అతి సాధారణమైన గ్రామీణ మనస్తత్వం గల స్త్రీ పురుషులు కలసి, పరస్పరం సహకరించుకుంటూ పనిచేయడం అనేది నిత్యానుభవం గాదు."

గాంధీజీ నిర్వచించిన, నిర్దేశించిన ఆ ప్రకారం త్వరలోనే సాధ్యం కాగలదని, ప్రజల జీవితప్రమాణాన్ని వృద్ధిచేయడమే పారిశ్రామికుల ఏకైక ఆశ అని కస్తూరిభాయ్ లాల్భాయ్ గారన్నారు.

పారిశ్రామికులకు కృతజ్ఞత తెలుపుతూ ఒక నిధికి ఇంత హెచ్చు మొత్తం విరాళంగా ఇవ్వబడడం ఇదే ప్రథమం, అని స్మారకనిధి అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాదుగారన్నారు. కలకత్తా జనుము పరిశ్రమలవారి సూచననుగురించి మాట్లాడుతూ ఆ విషయమై అంత్య నిర్ణయం చేయవలసింది ధర్మకర్తలే నన్నారు. గాంధీజీ మార్గాన్ని అనుసరించడమే ఆయనకు సముచితమైన స్మారకచిహ్నమని, నేడు భారతదేశమే గాక, యావత్ ప్రపంచం ఆయన సిద్ధాంతాలను అనుసరింప నుత్సాహపడుచున్నదనీ అన్నారు.

పండిట నెహ్రూ పారిశ్రామికులకు అభినందనాలు తెలుపుతూ, ఇంక ముందు కూడా ఇదే విధంగా ఈసంస్థలో సహకరిస్తారని ఆశిస్తున్నామని చెప్పారు.

అనంతరం సర్దార్ పటేల్ ఉపన్యసించగా సమావేశం ముగిసింది. పటేల్ ప్రసంగం విడిగా ప్రకటింప బడింది.)

### సర్వోదయ సమాజమునకు ప్రపంచంలో వ్యాప్తి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: సర్వోదయ సమాజమును, దాని ఆదర్శములను ప్రపంచములో వెల్లడిగావింపవలెననే ఉద్దేశ్యంతో ఆరు నెలలపాటు ప్రపంచమంతటా పర్యటించి వచ్చుటకై సమాజ విదేశాంగ కార్యదర్శి ప్రిన్సిపాలు ఎస్. ఎన్. అగర్వాల్ రేపు బొంబాయి బయలు దేరుచున్నాడు.

మహాత్మ గాంధీ ఆదర్శాలైన సత్యాహింసలలోనూ, నిర్మాణకార్యక్రమములోనూ నమ్మకమున్నవారందరినీ ఏకీకరించు సంస్థ సర్వోదయసమాజమని ఆయన చెప్పెను.

"ఇప్పటి కందులో 3 వేల మంది సభ్యులున్నారు. ఇంకను ప్రపంచ మందలి నలుదెసలనుండీ ఈ ఉద్యమమందు పాల్గొనగోరువారు లేఖలు వ్రాయుచునే యున్నారు." అని కూడ అగర్వాల్ తెలిపెను.

అగర్వాల్ వైనానుండి జపాను, హవాయి, అమెరికా, బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ, స్విట్జర్లాండు, చెకోస్లావేకియా, నార్వే, స్వీడను, బెల్జియం, హాలెండు, డెన్మార్కు, టర్కి, ఈజిప్టు వీటిపై రష్యాకువెళ్ళి తిరిగివచ్చును.

సర్వోదయ సమాజ కార్యక్రమమునే గాక, వివిధదేశాలలో విద్యాభివృద్ధి ఇటీవల ఎట్లు జరుగుచున్నదో పరిశీలించుటకు పాశ్చాత్య దేశాలలో పరిశ్రమలు ఎట్లు వికేంద్రీకరించబడుచున్నవో, అచ్చటి యువకోద్యమములు ఎట్లు అభివృద్ధి నొందినవో పరిశీలించుటకుకూడ అగర్వాల్ వెళ్ళుచున్నాడు.

అమెరికనులకు బాగా ఇష్టమైన జాతి సహనత్వము, మద్యపాన నిషేధము మహాత్మాగాంధీ నిర్మాణ కార్యక్రమ భాగములుగా ఉండవలెనని కూడ అగర్వాల్ చెప్పెను. గాంధీసిద్ధాంతములలో భారతీయులకు ఆసక్తి తగ్గుచుండగా, పాశ్చాత్యులు దానికొరకు ఉబద్వారా పడుచున్నారని కూడ ఆయన అనెను.

### శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

చిన్నపురి, ఏప్రిల్ 17: మద్రాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నెల్లూరు నుంచి నేటి ఉదయం మద్రాసు వచ్చిరి.

# నెహ్రూ ప్రభృతులతో షేక్ అబ్దుల్లా చర్చలు

## క్రొత్తప్రతిపాదనలపై భారతప్రభుత్వ పరిశీలనలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: ప్రస్తుతం ఢిల్లీలో ఉన్న జమ్మూ, కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా భారతప్రధాని పండిట్ నెహ్రూతోను, ఇతర మంత్రులతోను అత్యంత ప్రధానమైన సంప్రదింపులు జరుపుచున్నాడు.

నిన్న ఐక్యరాజ్యకమీషన్ సభ్యులు తెచ్చిన మూత్న అవహార ప్రతిపాదనలను పరిశీలించుటకై నేడు పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ ఇతరమంత్రులు జరిపిన చర్చలలోకూడ షేక్ అబ్దుల్లా పాల్గొన్నాడు.

ఈ నూత్న ప్రతిపాదనలు ఆమోదింపబడునా యని ప్రశ్నింపగా, 'సంప్రదింపులు ఇంకా జరుగుచున్నవి. ఫలితమేమగునో ఎవ్వరికీ తెలియదు' అని ఆయన చెప్పెను.

నిన్న నాయన కమీషన్ సభ్యులతో అనధికార సంభాషణ జరిపెను.

### అ. భా. సంపాదక మహాసభ అధ్యక్ష పదవి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: అఖిల భారత సంపాదక మహాసభ అధ్యక్షపదవికి ఈ సంవత్సరం వి. డి. మణి, హెచ్. ఆర్. మొహారే, సి. ఆర్. శ్రీనివాసన్ గార్ల పేర్లు సూచింపబడినవి. సభ్యులైనవారు ఓటింగు పత్రాలను మే 2 లోగా ఢిల్లీలోని కేంద్ర కార్యాలయానికి పంపాలి.

క్రిందటి గురువారం ప్రధాని నెహ్రూ ఇంటిలో విజయలక్ష్మి పండిట్ కుమార్తె చంద్రలేఖను అశోక మెహతాకు వివాహము జరిగినది

# "ప్రజలకు తిండి, బట్ట, తగినంత లభించకపోతే అశాంతి తప్పదు"

## నవభారత నిర్మాణంలో సహకరించవలసిందని పారిశ్రామికులకు ఉపప్రధాని ఉద్బోధ

న్యూఢిల్లీ ఏప్రిల్ 16: "గాంధీజీతో దివారాత్రములు గడిపిన మీదట నేను ఒక్క విషయము గ్రహించితిని.. మీ వలనగాని, మరితరుల వల్లగాని ఒక పనిని చేయించదలచిన, ఒకరి సంకల్ప ఉద్దేశ్యముల శంకించుట వలన ఏమీ ప్రయోజనము లేదు. అలాగాక ఇతరుల మాటలయందు విశ్వాసం ఉంచాలి. వారి మాటలను నమ్మాలి. పని జరిగేటట్లు చేయడానికి బాధ్యతల నిర్వహణ ఎవరిదో ఆట్టివారిపైన నే బాధ్యత ఉంచడం ఉత్తమమైన మార్గమని నా నమ్మకం. సంస్థానాధీశ్వరుల విషయంలో నేను అలాగే చేశాను. మీరు ఈ విరాళములు వసూలుచేయడానికి బాధ్యత వహించినారు. కాని ముందు నిర్వహింపవలసి ఉన్న పనితో పోల్చిచూస్తే, ఇది చాలా సులభమైన పనిగానే కన్పిస్తుంది. మీరు అన్నట్లు మనం, మీరు, మేము కూడా నిర్వహింపవలసిన బ్రహ్మాండమైన కార్యక్రమం మన ప్రజల జీవితప్రమాణాన్ని వృద్ధిచేయడం." అని భారత ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్ నేడు వారి భవనమున సమావేశమైన గాంధి జాతీయ స్మారకనిధి పారిశ్రామిక సంఘ సభ్యుల నుద్దేశించి హెచ్చరించెను. (ఈ కార్యక్రమ వివరాలు నిధి సమర్పణ, విడిగా ప్రకటింపబడినది.)

"ప్రజల జీవిత ప్రమాణాన్ని ఇప్పుడున్న దానిపై మూడవవంతు వృద్ధిని అయిదుసంవత్సరములలోనూ. పదిహేను సంవత్సరములలో నూటికి నూరువంతులు సాధింపవచ్చునని మీరు అన్నారు. అబాధ్యతను మీరందరు, మేమందరం నిర్వహింపవలెను. ఆలక్ష్యమును సాధించుటకు మనందరం ఒకచోటచేరి ఒక కార్యవిధానమును తయారుచేయుటమనందరివిధియైఉన్నది." అని సర్దార్ పటేల్ ఉద్బోధించెను.

ఒక అడుగు ముందుకువేసిన తరువాత ఇంక వెనక్కు తిరగడం అనేది లేదంటూ సర్దార్ పటేల్ ఇలా అన్నాడు: "మనం ఎంతసేపూ పురోగమించుచూ ఉండవలసిందే. వెనక్కు తిరిగిచూడడం అనేది పనికిరాదు. అథవా అలాంటి వెనుచూపు అవసరం అయితే అవిమనం సాధించిన అభివృద్ధి తగినంతగా, జరుగవలసినంత వేగంగా జరుగుటలేదని గ్రహించి "అభివృద్ధి గమనాన్ని" వేగంచేయడానికి మాత్రమే, పారిశ్రామికవర్గం మొత్తంగా ఈ బాధ్యతను నిర్వహించడానికి సమ్మతించకపోతే మనం విజయాన్ని పొందలేము. మన మధ్య అవిశ్వాసమును, అపోహలను కల్గించడానికి అనేకసంఘటనలు జరిగినవి. అనేక కష్టాలు ఏర్పడినవి. మీ సాధనసంపత్తిని ప్రజ్ఞా పరిజ్ఞానాన్ని వినియోగించుకొనక పోతే దేశం ఏలాంటి అభివృద్ధిని పొందలేదనే సంగతి నాకు పూర్తిగా తెలుసును. ఈ కారణంవల్లనే మనం ఒకరొకరు అర్థం చేసుకోవడం ఒకరితో ఒకరు సహకరించడం ఆత్యావసరం.

"మన ఇరుగు పొరుగు దేశాల్లో పరిస్థితులు ఎలా ఉన్నవో చూడండి. అలాంటి సంఘటనలు మన దేశంలో జరగకుండా నివారించాలి. మనం సకాలంలో తగిన చర్యలు తీసుకొనక పోతే అంతా చేయిదాటి పోయి మహా విలయం

మనల నావహింప వచ్చును. అదృష్టవశాత్తూ మన ఇరుగుపొరుగు దేశాల కంటే మనం కొంత ఉచ్చ స్థితిలో ఉన్నాం. కాని మన లాభాలను వదిలపెట్టుకొని ఇష్టంబడిగా వాట్ని మార్చుకొనక మన అనుభవంనుండి, గుణపాఠం నేర్చుకొనకపోతే ఈ నాటి మన మంచి స్థితి ప్రయోజనాన్ని పొందలేము. మన అభివృద్ధికొరకు అదే పనిగా కృషిచేసుకుపోవడానికి 'శాంతి' ముఖ్యంగా అవసరం. అట్టి శాంతిని మనం సాధించాం. కాని ప్రజలకు కావలసినంత తిండి, అవసరమైనంత బట్టలు లభించకపోతే ఆ శాంతి ఎంతో కాలం ఉండదు. కేవలం బలప్రయోగంద్వారానే మనం శాంతిని సాధించలేము. కనుక స్వాతంత్ర్య ఫలితాలను పరిపూర్ణంగా అనుభవించకలిగేటందుకు మనం ప్రజలకు వీలుచేయకపోతే తృప్తిచెంది, సుఖాన్ని అనుభవింపగల దేశాన్ని మనం స్థాపింపజాలము. అలాంటి సౌఖ్యప్రదమైన, తృప్తికరమైన జీవితాన్ని సాధింపవలసిన బాధ్యత ప్రధానంగా మీపైనా, మాపైనా ఉంది. యావత్తు భారాన్ని మీపైనే ఉంచాలని నేను అనుకోవడం లేదు. ఆ భారంలో మేమూ భాగం పంచుకుంటాము. అయితే మీరు ఒక్క విషయం గ్రహించుకోవాలి. పరాయిప్రభుత్వం క్రింద అంతా మీకు ప్రతికూలంగా ఉండగా, విదేశీయుల పోటీని తట్టుకొని పరిశ్రమలు స్థాపించి అభివృద్ధిని సాధించిన మీరు ఈనాడు మీ జాతీయ ప్రభుత్వం ఉండగా మీరా పనిని ఎందుకు చేయలేరు? మీరూ మేమూ కలిసి పరస్పర సహకారానికి ఒకరికొకరు తోడ్పడడానికి ఒక పథకాన్ని తయారుచేసిన సంతృప్తి నొంది, సుఖంగా కాలం గడపగల భారత దేశమునకు బునాదులను వేయగలం అనే నేను మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను.

"మీరు అనేక "ఇజం"ల గురించి మాట్లాడారు. అవి మనల్ని ముంచివేస్తే ఆతప్పు పూర్తిగా మనదే అవుతుంది. మన బాధ్యతలను మనం అలక్ష్యం చేయడమే అందుకు హేతువు అవుతుంది. నైతిక శక్తే మీకుగల బ్రహ్మాస్త్రం. బలప్రయోగంచేసే అధికారం అధికారం ఎన్నటికీ కాజాలదు. నైతికశక్తి అధికారం మీఅందనుఉంటే అంతా సవ్యంగానే జరిగిపోతుంది. మీరు భయపడవలసినదేమీ ఉండదు. మీ దేశం కొరకు త్యాగం చేసినట్లైతే ఈ నైతికశక్తి సముపార్జనకు కూడా మీరు త్యాగం చేయ మీరు సిద్ధంగా ఉన్నంతకాలం దేశ భవిష్యత్తును గురించి ఏమీ భయంలేదు. త్యాగమునకు గాంధిజీ చూపినమార్గం. మన దేశాన్ని బలిష్ఠం చేయడానికి సంపన్నం చేయడానికి మనం అనుసరింపవలసిన మార్గం అదే. ప్రజలు మీపైనా వారిలోనూ ఈ మాత్రం విశ్వాసం ఉంచితే మన దారిలో నాకేలాంటి ప్రతిబంధకాలూ కన్పించడంలేదు.

"మీరు ఆర్జించుచున్న సంపదకూడ దాచిపెట్టేందుకుగాదు. దేశంకొరకు వినియోగం కావడానికే ప్రస్తుతం ఉన్న అపోహలను, అనుమానాలను తొలగించడానికి చర్యలద్వారా ప్రయత్నింపవలసిందని నేను మీకు విజ్ఞప్తి చేయుచున్నాను. ప్రజల్లో దురభిప్రాయం కలుగుతుందనే భావంలో చాలామంది మీతో బాటు బహిరంగంగా కన్పించడానికి వెరచి తప్పుకు తిరుగుతున్నారు. చాలామంది మిమ్మల్ని చూచి అసహ్యించుకుంటారు. అలాంటి విమర్శలలో నావంతుకు రావలసింది నాకువచ్చింది, కాని ఆ విమర్శలను ఆదరచేయవద్దని గాంధిజీ నాకు బోధించారు. అలాంటి నా టన్నింటిని దిగమింగడానికి తగిన ప్రతిష్ఠను భగవంతుడు నాకు ప్రసాదించాడు. ఈ విధంగా 'సృష్టి' అవుతున్న భారతదేశానికి మహోన్నత దాయకం అని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను. మీరంతా కూర్చుని ఎక్కడ ఏదిలో పంగుతుందో విచారించుకోవాలి. మన మాతృభూమి నైతిక సంపద అభివృద్ధికి యథాశక్తి మనం అందరం సమష్టికృషికి తోడ్పడాలి. ఈ సంయుక్త, సమష్టికృషికి ప్రతి ఒక్కరి సహకారాన్నీ సంపాదించేటందుకు ఒక్క ప్రయత్నం చేయగలవని ఆశిస్తున్నాను. మీ సహాయ సహకారాలను అపేక్షిస్తున్నాను. మీరు ఈ ప్రసంగంలో వెల్లడించిన లక్ష్యాన్ని మన సమష్టి ప్రయత్నం ద్వారా సాధింపగ నిముల ఆశిస్తున్నాను."

# "మహాత్ముడు నిర్మించిన సంప్రదాయ సంపదను వినియోగించుకోవాలి"

## అహమ్మదాబాద్ రేడియో కేంద్రం ప్రారంభోత్సవ సందర్భంలో సర్దార్ పటేల్ సందేశం

అహమ్మదాబాద్, ఏప్రిల్ 16: సబర్మతీ ఆశ్రమవాసుల గానకలాపాలతో, ఈరోజు అహమ్మదాబాదులో, ఆలిండియా రేడియో కేంద్రం ప్రారంభింపబడ్డది. ఈ ప్రారంభోత్సవంసర్దార్ పటేల్ సందేశంపంపుతూ "సబర్మతీ ఆశ్రమ స్థానంగానూ, మహాత్ముని ఆవాసంగానూ అహమ్మదాబాదు నగరం జగద్విఖ్యాతి నార్జించుకుంది. ఈ రేడియో కేంద్రం మహాత్ముడు నెలకొల్పిన సాంప్రదాయి సంపదను ఉజ్వలంగా ఉపయోగించుకుంటుంది" అని తెలియజేశారు.

పటేల్ సందేశం పూర్తిపాఠం:

"నైతిక ధర్మాన్ని పెంపొందించటానికి రేడియో బలమైన సాధకం. సరిగా నిర్వహింపగలిగితే భారత ప్రజలకు చాలా మేలు చేకూరుతుంది. ఈ కేంద్రంకూడా కలుపుకొని భారతదేశంలో ఇప్పుడు 15 కేంద్రాలున్నయ్; క్రిందటి సంవత్సరం క్రొత్త కేంద్రాలను ఒక 9 వరకూ స్థాపించాం. ఒకవిధంగా ఈ కేంద్రాలన్నీ కూడా తాత్కాలిక నిర్మాణాలే అనవచ్చు. యేమంటే వీటన్నిటికీ సరియైనయంత్రసామగ్రిరావలసివుంది. ప్రస్తుతం లభ్యమైన సామగ్రిని మాత్రం ఉపయోగిస్తున్నాం.

"అహమ్మదాబాదు గొప్ప పారిశ్రామిక కేంద్రం. ఇక్కడ కార్మిక ప్రజలు చాలామంది వున్నారు. రేడియో కార్యక్రమాల్లో పాల్గొని వారికి గల శక్తిసామర్థ్యాలను పెంపొందించుకోటానికి మంచిసావకాశం కలుగుతుంది. మిల్లుల యజమానులుకూడా ఈ కార్యక్రమానికి తగిన దోహదం చెయ్యాలి.

"అహమ్మదాబాదు చాలా పురాతనమైన నగరం. అనేక ప్రధాన పరిశ్రమలున్న కారణంగా ఈ నగరం చాలా అభివృద్ధిలోవున్నది. అంతేకాదు మహాత్ముడు అక్కడే ఆవాసంకల్పించుకుని, సబర్మతీ ఆశ్రమాన్ని నిర్మించిన కారణంగా ఈ 25 సంవత్సరాలనుంచి జగద్విఖ్యాతంగా ఎన్నికకువచ్చింది. మహాత్ముడు నిర్మించిన సాంప్రదాయ సంపదలను ఈ రేడియో కేంద్రం బాగా ఉపయోగించుకోవాలి. ఈ ప్రారంభోత్సవంలో సబర్మతీవాసులు పాల్గొనడం సంతోషదాయకం.

"మహాత్ముడు తన నైతిక ప్రచారానికి చివరిరోజుల్లో, రేడియోను బలమైన సాధనంగా ఉపయోగించారు; ఢిల్లీ నుంచి ఆయన ప్రార్థన సమావేశాన్ని యెప్పటికప్పుడు ప్రసారం జరుగుతు వుండేది.

### తూ. పంజాబు నూత్న మంత్రివర్గపు నిర్మాణం

న్యూఢిల్లి, ఏప్రిల్ 16: కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు వారి ఆదేశములను శిరసావహించుటకు తూర్పుపంజాబు ప్రధాని లాలా భీమసేనసచార్ గ్రూపువారు, మాజీ ప్రధాని డా॥ గోపీచంద్ భార్గవా గ్రూపువారు ఒప్పుకున్నందున సోమవారంనాటికి సిమ్లాలో క్రొత్త మంత్రివర్గం పునర్నిర్మింపబడగలదని భావింపబడుచున్నది.

పార్లమెంటరీబోర్డు వారి పిలుపుపై నేటి సాయంత్రమిచ్చుటకు వచ్చిన డా॥ భార్గవా కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారిని నేటిరాత్రి కలిసికొనెను.

సచార్ మంత్రివర్గంలో మీరుకూడ చేరెదరా యని అడుగగా "నేను సిపాయిని, కాంగ్రెసు అధిష్ఠాన వర్గపు ఆదేశములను తలతాల్చుటకు వెనుకాడను," అని భార్గవా చెప్పెను.

పార్లమెంటరీబోర్డు ఆదేశానుసారం సచార్ మంత్రివర్గంలో హరిజన సభ్యుని ఎన్నిక వాదాపు తేలినట్లే కనిపించుచున్నది. తూ. పంజాబు శాసనసభలోని 8 మంది హరిజన సభ్యులలో ఆరుగురు నేడు డా॥ రాజేంద్రప్రసాద్, పట్టాభి, జగ్జీవనరాం గార్లను కలసికొని పృథ్వీసింగు అజాద్ ఎన్నికకు తమ ఏకగ్రీవామోదమును తెలిపిరి. పృథ్వీసింగ్, అజాద్ నంగీకరింపవలెనని వారు లాలా సచార్ ను కూడ కోరిరి. వీరు రేపు సర్దార్ పటేలును కలిసికొందురు.

### పటేల్ ప్రయాణం చేసిన విమానం ఇంజన్ల తనిఖీ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: సర్దార్ వల్లభభాయ్ పటేల్ గతమాసంలో ప్రయాణం చేస్తుండగా, జయపూర్ వద్ద బలవంతంగా నేలకు దిగిన విమానపు ఇంజన్లను తనిఖీ చేయుటకు విమానశాఖ ప్రధాన కార్యాలయంవారు ప్రత్యేకం నిపుణులతో కూడిన ఒక సంఘం ఏర్పాటుచేశారు. వారు సమగ్రమైన తనిఖీచేశారు. (యు, ప్రె.)

# కంచి కచర్లవద్ద ఎస్. ఎ. పి. లారీబోల్తా

## ఒక కానిస్టేబిల్ మరణం: 19 మందికి గాయాలు

విజయవాడ, ఏప్రిల్ 15: హైదరాబాదు సంస్థానానికీ కృష్ణాజిల్లాకూ సరిహద్దున ఉన్న షేక్ మహమ్మద్ పేట నుంచి విజయవాడ వస్తున్న ఎస్. ఎ. పి. లారి ఒకటి నేటిమధ్యాహ్నం కంచికచర్లవద్ద బోల్తాపడి అందులోని 20 మంది ఎస్. ఎ. పి. కానిస్టేబిల్సులో ఒకతను మరణించుటా, మిగతా 19 మంది గాయపడుట జరిగింది.

గాయపడినవారిని విజయవాడలోని ప్రభుత్వ ఆస్పత్రికి చికిత్సకు తీసుకు వచ్చారు. వీరిలో 4 గురికి తీవ్రగాయాలు తగిలాయి. ఒకతను ప్రమాదస్థితిలో ఉన్నాడు.

విజయవాడ పట్టణ తాత్కాలిక సర్కిల్ ఇన్స్పెక్టరు ఎ. రామ నాదరావుగారు మరణించిన పోలీసు శవముపై పంచాయతీ జరిపించి శవాన్ని దహన సంస్కారము నిమిత్తం స్థానిక ఎస్. ఎ. పి. కమాండరు స్వాధీనంచేశారు.

మధురజిల్లాలోని పళని ఎస్. ఎ. పి. తాలూకు 5 పటాలం షేక్ మహమ్మద్ పేటనుంచి పళని వెళ్ళుటకుగాను 6 లారీలలో విజయవాడ వస్తుండగా ఈలారీ, స్టీరింగ్ వీల్ డ్రయివరు స్వాధీనము తప్పినందున ఈ ప్రమాదం సంభవించినట్లు చెప్పారు. (స్వ. వి.)

### 'పెరియార్' ఆరెస్టు: జామీనుపై విడుదల

కోయంబత్తూరు, ఏప్రిల్ 16: ద్రవిడ కజగం నాయకుడు పెరియార్ ఇ. వి. రామస్వామినాయకరూ, మరి ముగ్గురూ, నేటి సాయంత్రం, ఉడుమలపేటలో, అమలులోవున్న 144-వ సెక్షన్ ఉత్తరువులను ఉల్లంఘించినందుకు అరెస్టుచేయబడ్డారు. దరిమిలాను జామీనుపై విడుదల అయినారు.

### పీపింగు సంప్రతింపులు

#### అధ్యక్షునితో ప్రభుత్వ రాయబారవర్గ సభ్యుని చర్చ

నాన్కింగ్, ఏప్రిల్ 16: పీపింగ్ నుండి చైనా ప్రభుత్వ రాయబారవర్గానికి చెందిన ఒకరు నేడిచటికి వచ్చి తాత్కాలిక అధ్యక్షునికి ఒక నివేదికను అందచేసినట్లు తెలుస్తున్నది. ఇతను ఒక ఒడంబడిక ముసాయిదాను తెచ్చెనన్న వదంతులు ధృవపడలేదు. ఈయన ఇక్కడికి వచ్చినవెంటనే అధ్యక్షుని కలుసుకొని దీర్ఘ సంభాషణలు జరిపెను. పీపింగు సంప్రతింపులు సాఫీగా సాగిపోతున్నవని చైనాపత్రికలు ప్రకటించినవి. కాని ప్రభుత్వసేనల పునర్నిర్మాణం విషయమే ఇంకా గడ్డుగా వుందని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.

### రష్యా పరిషియా సంబంధబాంధవ్యాలు

టెహరాన్, ఏప్రిల్ 16: 1921 లో తమ రెండు దేశాలూ చేసికొన్న ఒడంబడిక షరతుల ననుసరించి ప్రవర్తింపవలెనని రష్యా పరిషియాను ఒత్తిడిచేస్తున్నదని న్యూయార్కులోని ఒకపత్రిక ప్రచురించిన వార్త నిరాధారమైనదని పరిషియా ప్రభుత్వం నేడు ప్రకటించింది.

### జాతీయ బుర్రకథల పోటీ

నిడుబ్రోలు, ఏప్రిల్ 15: ఇక్కడ శ్రీరామనవమి ఉత్సవసంఘ ఆధ్వర్యాన జాతీయ బుర్రకథల పోటీ జరుపబడుచున్నది. ప్రజలు వేలకొలది వచ్చి ఆనందించుచున్నారు. పలు ప్రాంతాలనుండి బుర్రకథ జట్టులు వచ్చి పోటీలలో పాల్గొనుచున్నాయి. పోటీలు పూర్తి అయిన పిదప బహుమతులొసంగబడును.

# శాంతి ఏర్పడువరకూ కేంద్ర ప్రభుత్వపాలన సాగవలెను

## ఖమ్మం యువజన కాంగ్రెసు సూచన

ఖమ్మంమెట్టు, ఏప్రిల్ 15: రెండు సంవత్సరముల అనంతరం పట్టణ ఆంధ్ర యువజన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశము నిన్నరాత్రి శ్రీ రాయపూడి నారాయణరావు అధ్యక్షతన జరిగింది. హైదరాబాద్ రాజకీయ పరిస్థితులను సమీక్షచేస్తూ ఈదిగువ తీర్మానము చేయబడెను.

"హైదరాబాద్ సంస్థాన స్వాతంత్ర్య పోరాటానంతరం నేటి హైదరాబాద్ రాజకీయ వాతావరణంపట్ల యీ సమావేశం తీవ్ర అసంతృప్తిని ప్రకటిస్తున్నది. మహాత్మాగాంధీ నాయకత్వం క్రింద ముప్ఫయి సంవత్సరాలుగా సాగిన భారత స్వాతంత్ర్య పోరాటాదర్శాలను నేటి హైదరాబాద్ రాజకీయ కార్యకర్తల్లో పెక్కుమంది తమ ఆదర్శాలుగా భావించటంలేదని యువజన కాంగ్రెస్ అభిప్రాయపడుతున్నది. కేవలంరాజకీయపు టధికార వాంఛాప్రేరేపితులైన కొందరు స్వకీయ ప్రాబల్యంకోసం అటు అభివృద్ధి నిరోధకులైన కమ్యూనిస్టులనూ ఇటు కలుషితమైన కాంగ్రెస్ సంస్థను ఉపయోగించుకొంటున్నారు. పవిత్రమైన జాతీయోద్యమం ఇలా కలుషితమైనందుకు యువజన కాంగ్రెస్ తన విచారాన్ని తెలుపుతున్నది. యువకులకూ ప్రజానీకానికీ శాంతియుతమైన, చట్టబద్ధమైన పద్ధతులలో విశ్వాసం కలిగించవలసిన అవసరాన్ని యువజన కాంగ్రెసు గుర్తిస్తూ సంపూర్ణమైనట్టిన్నీ సుస్థిరమైనట్టిన్నీ శాంతి సంస్థానంలో నెలకొనేవరకు సంస్థానాన్ని కేంద్రప్రభుత్వపరిపాలిత ప్రదేశంగా ప్రకటించవలసిందిగా యువజన కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతున్నది.

తదనంతరం కమ్మర్షియల్ కార్పొరేషన్ వారి ద్వారా ఆహార పదార్థాలు సరఫరా చేయ పూనుకొంటే ఆహార పరిస్థితులు బాగు పడవని అభిప్రాయ పడుతూ, బియ్యంలో ఎక్కువగా నూకలు కల్పబడుతున్నవనీ, ముక్క జొన్నలు రేషనింగ్ దుకాణాలలో అమ్మబడుతున్నవని తెల్పుతూ దీనికంతటికీ ఏజెంట్లధనాపేక్ష, అధికారుల లంచగొండితనమే కారణమనీ, భావిస్తు తిన యోగ్యమైన ఆహార పదార్థముల సప్లయి చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేయబడెను.

సివిల్ మిలటరీ అధికారుల నిమిత్తమనే ప్రస్తుతం నెలకొల్ప బడ్డ యూనియన్ పోస్టాఫీసును ప్రజలకు కూడా యుపయోగ పడేటట్లు చేయవలసిందిగా ప్రభుత్వాధికారులను కోరుతూ మరొక తీర్మానం చేయబడింది. (స్వ. వి.)

## హైద్రాబాదు రేడియోలో బి. బి. సి. ప్రసారం నిలుపుదల

హైద్రాబాద్, ఏప్రిల్ 16: హైదరాబాద్ బ్రాడ్ కాస్టింగ్ స్టేషన్ ఈ నెల ఏప్రిల్ 16 నుండి బి. బి. సి. (లండన్) రేడియో వార్తలను ప్రసారించటం నిలిపివేసినది. అయితే ఢిల్లీ కార్యక్రమాలను ప్రసారం చేయటంమటుకు యథావిధిగా జరుగుతునే ఉంటుంది. (యు. ప్రె.)

## 'శాంతి కాముక ప్రపంచ మహాసభకు వెళ్ళేవారికి పాస్ పోర్టుల నిరాకరణ

బొంబాయి, ఏప్రిల్ 16: పారిస్‌లో ఈ నెల 20న జరుగనున్న శాంతి కాముక ప్రపంచ మహాసభకు వెళ్ళదలచిన ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధి ఎం. ఎస్. బక్షి, ఇండియన్ పీపిల్స్ థియేటరుకు చెందిన డి. ఎస్. గావన్ కార్, అన్నాబావుసంతే, అమర్ షేక్, ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్‌కు చెందిన కిషన్‌చందర్ గార్లకు పాస్‌పోర్టులు నిరాకరింపబడినవి. ఇందుకు కారణము నేనా చెప్పలేదు. కాని, ఈ మూడు సంస్థలూ ఇండియా కమ్యూనిస్టు పార్టీతో సంబంధమున్నవి.

పోలీసులు నేడు ప్రయాణ సౌకర్యాలు కలిగించే ఒక సంస్థ కార్యాలయానికి వెళ్ళి చూసి, ఇదే మహాసభకు వెళ్ళనున్న డాక్టర్ ముల్కరాజ్ ఆనంద్, విద్యా కమాగా, సుల్తాన్ నిరుపజీల పాస్‌పోర్టులు స్వాధీనము చేసుకొన్నారు.

## ప్యారీలాల్ కరాచీ ఆగమనం

కరాచీ, ఏప్రిల్ 16: మహాత్మాగాంధీకి అంతరంగిక కార్యదర్శిగా పనిచేసిన ప్యారీలాల్, నవకాళీలోని గాంధీ ఆశ్రమానికి చెందిన రామచామహాదేవితో నేడు కరాచీ వచ్చారు. ప్యారీలాల్ ఇక్కడ పాకిస్థాన్ గవర్నర్ జనరల్‌నూ, ప్రధానమంత్రినీ సందర్శిస్తారు.

# నూతుల త్రవ్వకానికి సహాయం

## హైదరాబాద్ ప్రభుత్వ విధానం

హైదరాబాద్, ఏప్రిల్ 16: నూతుల త్రవ్వకానికి రైతులకు సహాయం చేసే నిమిత్తం హైదరాబాదు ప్రభుత్వం 3 లక్షల రూపాయలు మంజూరు చేసింది. అయితే ఇందుకు కొన్ని షరతులు పెట్టింది. ఈ సహాయంతో త్రవ్వబడే నూతులు ఈ సంవత్సరం జూన్ నెలాఖరులోగా పూర్తి కావాలి. ఆ నూతుల నీరు వచ్చే నాలుగు సంవత్సరాలలో ఆహార పంటలు పండించడానికి వినియోగం కావాలి.

ఒక్కొక్క నూతికయ్యే ఖర్చులో సగంవరకే ప్రభుత్వ సహాయం లభిస్తుంది. అందులోనూ ఒక్కొక్క నూతికి రూ. 500/- లకు మించి లభించదు.

### సివిల్ సప్లయిల శాఖ జిల్లా అధికారుల సమావేశం

హైదరాబాదు ప్రభుత్వ సివిల్ సప్లయిల శాఖ సభ్యుడు పి. హెచ్. కృష్ణరావు గారు నేడు యునైటెడ్ ప్రెస్ ప్రతినిధితో సంభాషిస్తూ, స్థానిక స్థితిగతులు జాగ్రత్తగా అకళింపు చేసికోనిదే పునర్నిర్మాణమార్గమేదీ లేదన్నారు. స్థితిగతులు తెలిసికొనే నిమిత్తం జిల్లాలలోని సివిల్ సప్లయిల, టెక్స్టయిల్ శాఖల ఉద్యోగుల సమావేశం ఒకటి యేర్పాటు చేస్తామన్నారు.

## గాజిబండలో కొట్లాట: 38 మంది అరెస్టు

హైదరాబాదు నగరానికి 3 మైళ్ళ దూరాన గల గాజిబండలో ఈ నెల 13, 14 తేదీలలో ముస్లిములలోనే రెండువర్గముల వారికి కొట్లాట జరిగింది. చాలామంది గాయపడ్డారు. ఒకరు తీవ్రంగా గాయపడ్డారు. పరిస్థితిని అదుపులోకి తెచ్చిన పోలీసువారు, 38 మందిని అరెస్టు చేశారు. కొన్ని కత్తులు, తుపాకులు మొదలైనవి పట్టుబడ్డాయి.

అప్పుడు ఒక మామిడితోటలోని పచ్చిమామిడికాయలు కోసుకోవటానికి కొందరు ప్రయత్నింపగా తగాదా రేగి ఈ కొట్లాట జరిగినట్లు తెలిసింది.

## మామిడి పండ్లకు గిరాకి

ఈ సంవత్సరం హైదరాబాదు సంస్థానంలో 25 లక్షల పైచిలుకు మణుగుల మామిడిపండ్లకు గిరాకీ ఉంటుందని వ్యాపారవర్గాలవారు అంచనా వేస్తున్నారు. గత సంవత్సరం 18 లక్షల మణుగుల మామిడిపండ్లు తినుబడి అయినవట. వాటిలో 50 వేల మణుగులు దిగుమతి అయినట్టివట. ఈ యేడు రవాణా సౌకర్యాలు మెరుగైనాయి కాబట్టి దిగుమతులు ఎక్కువ కాగల వనుకొంటున్నారు. సంస్థానంలో 23,910 ఎకరాల భూమి మామిడితోపులకింద వుంది. ఇందులో ఎక్కువభాగం ఔరంగాబాద్ జిల్లాలో వుంది.

## సికందరాబాదులో ముగ్గురి అరెస్టు

హైదరాబాద్, ఏప్రిల్ 16: కమ్యూనిస్టులకోసం గాలిస్తున్న నగర పోలీసులు నిన్న సికందరాబాదులో ముగ్గురిని అరెస్టు చేశారు. ఈ ముగ్గురూ నాయకశ్రేణిలోని వారేనని అంటున్నారు.

14-వ తేదీన సంస్థాన పోలీసులు సి. ఐ. డి. సహాయంతో నగర శివార్లలో వున్న హిమాయత్ సాగర్ మీదికి పోయి, అక్రమపనులలో పాల్గొంటున్నారనే ఆరోపణకింద కొంతమంది వడ్డేవారిని అరెస్టుచేశారు. ఈసందర్భంలో కొన్ని తుపాకులు వగైరాకూడా పట్టుపడ్డాయి.

## పుదుచ్చేరిలో పాకిస్థాన్ కాన్సలేట్ స్థాపన

పుదుచ్చేరి, ఏప్రిల్ 16: పాకిస్థాన్ ప్రభుత్వం త్వరలో ఇచ్చట ఒక కాన్సలేట్ ఏర్పాటుచేయునని తెలియవచ్చింది.

# భార్యపై అనుమానంతో ఇంటికి నిప్పు

## హుగ్లీ జిల్లాలో జరిగిన దారుణోదంతము

కలకత్తా, ఏప్రిల్ 14: హుగ్లీ జిల్లా, శ్రీరాంపూర్ గ్రామంలో 4 గురు మనుష్యులు మంటలలో చిక్కి మరణించిరని ఒక వార్త నేడు వచ్చినది.

తన భార్య వ్యభిచరించుచున్నదనే అనుమానంతో బాధపడుచున్న ఒక మోటారు డ్రైవరు గతమంగళవారం హఠాత్తుగా తన ఇంటి తలుపును తట్టి గదిలో పెట్రోలు విసరి నిప్పు అంటించెను. దానితో, లోపల ఉన్న డ్రైవరు భార్యకు, ఇద్దరు బాలికలకు, మరి ఒక యువకునికి తీవ్రమైన అగ్ని గాయములు తగిలినవి. గ్రామస్థులు వెంటనే ఆ చోటికి పరుగెత్తి, తలుపు బద్దలు కొట్టి గాయపడిన వారిని ఆస్పత్రికి పంపించిరి. కాని కాస్సేపటికందరూ మరణించిరి. మోటారు డ్రైవరును పోలీసులరస్టుచేసి దర్యాప్తు చేయుచున్నారు.

## ఉప్పునీటినుండి మంచినీరు

మద్రాసు ఏప్రిల్ 16: ఉప్పునీటి ఆధారాలనుండి మంచినీరును తయారు చేయడానికి బెంగళూరులోని ఇండియన్ సైన్సు ఇన్‌స్టిట్యూటులో జరుగుచున్న పరిశోధనను మద్రాసు ప్రభుత్వం మరి మూడు సంవత్సరాల వరకు పొడిగించింది.

మద్రాసు గవర్నరకు సలహాదారుగా వ్యవహరిస్తున్న కాలంలో సర్ ఎస్. వి. రామమూర్తిగారు ఈప్రణాళికను తయారు చేశారు. ఈ పరిశోధన నిమిత్తం మద్రాసు ప్రభుత్వం సైన్సు ఇన్‌స్టిట్యూట్‌కు సాలుకు పదిహేను వేల రూపాయల సబ్సిడీ నిస్తోంది. గ్లోబ్

## టిక్ చేయని గడియారం

లండన్, ఏప్రిల్ 15: ఒక బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు టిక్ చేయని గడియారాన్ని తయారుచేశాడు. త్వరలోనే ఈరకం గడియారం అధిక మొత్తాలలో ఎగుమతిచేయబడుతుంది. ఈరకపు గడియారాలు అలారమ్ గడియారాలనుండి పెద్ద పెండ్యులమ్ గడియారాలవరకు తయారు చేయబడుతాయి. ఇవి విద్యుచ్ఛక్తితో నడుపబడేవికావు.

దీనిని కనిపెట్టినది, సి. ఎస్. క్లిఫర్డ్ గారు. అమెరికన్ వ్యాపారస్థులు ఈ గడియారంలో చాలా శ్రద్ధను చూపుతున్నారు. దీనివల్ల బ్రిటన్‌కు వేలకొలది డాలర్లు లభిస్తాయి. —గ్లోబ్

## జర్మన్ భాషలో నెహ్రూ గ్రంథాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: పండిత నెహ్రూ ఆత్మకథ, "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" లు జర్మన్ భాషలోనికి అనువదించ బడుతున్నాయని తెలుస్తున్నది. "డిస్కవరీ ఆఫ్ ఇండియా" కొలదికాలం క్రితమే జర్మన్‌లోనికి తర్జుమా చేయబడింది.

ఈ రెండు గ్రంథాలు త్వరలోనే జ్యూరిక్‌లో ప్రచురించబడతాయి. —గ్లోబ్

## బీహారురాష్ట్రమంతటా బుద్ధ జయంతి సన్నాహం

పాట్నా, ఏప్రిల్ 16: బీహారురాష్ట్రమంతటా మే 2న బుద్ధ జయంతి జరుపుటకు పెద్దఎత్తున సన్నాహంజరుగుతున్నది. బీహారుప్రభుత్వం ఆరోజు సెలవుగా ప్రకటించింది. డాక్టర్ రాజేంద్రప్రసాద్, రాధాకృష్ణన్ ప్రభృతి ప్రముఖులూ, విదేశాల రాయబారులూ ఈ ఉత్సవంలో పాల్గొంటారని తెలుస్తున్నది.

### వాలెస్‌బెర్రీ మరణం

ప్రసిద్ధ ఫిలిం నటుడు వాలెస్‌బెర్రీ హాలీవుడ్ లో 15-వ తేదీ రాత్రి మరణించాడు.

# దొంగవ్యాపార నిరోధ చట్టనిరసనము

## వస్త్రవ్యాపారస్థుల రాష్ట్రీయసభ

### కంట్రోల్సు తొలగించాలని శ్రీ విశ్వనాథంగారు

మదరాసు, ఏప్రిల్ 16:—"కంట్రోలన్నది జెయిలులోనే బాగుగ కొనసాగగలదు. జెయిలులోనుండే క్రమశిక్షణతో అది అమలు జరుగునుగాని బయట బాగుగ అమలుజరుగదు. కంట్రోలు నిర్బంధాలను నేను సహించను. అవి చెడుగు. ఎంత త్వరలో అవి తొలగిన అంత మంచిది. కంట్రోలు ఉండాలని కోరేవారు స్వార్థపరులు కొందరును, ఉద్యోగస్థులును. యితరులు వాటిని కోరరు" అని శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు, నేడు మధ్యాహ్నము చెన్నరాష్ట్ర వస్త్రవ్యాపారస్థుల సభ ప్రారంభించుచు నుడివిరి. ప్రభుత్వంవారు తలపెట్టిన దొంగవ్యాపారచట్టం నిరసించుటకు యీ సభ సెంటు మేరీసుహాలులో ఏర్పాటు చేయబడెను. విశ్వనాథంగారు ప్రారంభోపన్యాసము నొసంగుచు, తమకే వ్యాపారస్థుల వాతావరణము క్రొత్తనియు, సలహా ఇచ్చుటకన్న, విషయం తెలుసుకొనుటకే ముఖ్యంగా వచ్చితిమనియు తెలిపిరి.

కంట్రోలు విధానమును అది అమలు జరిగే పద్ధతిని నిరసించుచు, దానివల్ల ఒకపాను మేలుంటే యింకో పాను కీడు కూడా గలదనియు, జాతిని అవినీతిలోనికి దించుననియు, చాలవర్కంగా సందర్భము... ఏదో, ఒక సందర్భములో యీ నియమాలు తప్పి ప్రవర్తించక తప్పదనియు చెప్పిరి.

"దొంగ వ్యాపారనిరోధ చట్టమును యీ వ్యాపారస్థుల సభ నిరసించుచున్నది. ఈ చట్టం ఒక్కటే యీ సభవారు గమనించిరి. కాని ప్రభుత్వం వారు తయారు చేస్తున్న చట్టాలన్నిటూడ యిట్లే. సామాన్య న్యాయసూత్రాలకు విరుద్ధంగా నున్నాయి. ఈ చట్టంలో నున్న శిక్షాస్మృతి పూర్వయుగాలకు చెందిన పిచ్చి పద్ధతుల ననుసరించుచున్నది. నేరస్థుడని రుజువయ్యేవరకు ప్రతివానిని పెద్ద మనిషిగనే ఎంచబడునని శిక్షాస్మృతులన్నింట అంగీకరింపబడిన సిద్ధాంతమయి యుండ, యీ చట్టంలో వ్యాపారస్థు లందరు నేరస్థులనే భావం వెలిబుచ్చబడింది. కేంద్ర ప్రభుత్వం వారు కూడ యిట్టి చట్టాలు కొన్ని చేస్తున్నారు. కనుక ప్రస్తుత స్వతంత్ర వాతావరణంలోనే ఎవో కొంచెంలోపమున్నట్లున్నది. దేశంలోను ప్రజలలోను చెడుగు కన్న మంచియే ఎక్కువవుండును. అట్లుగాక మంచి కొన్న చెడుగే ఎక్కువనే నమ్మకంతో యీ చట్టం తలపెట్టబడింది.

"ప్రజాభిప్రాయం దృఢంగా దీనికి ప్రతికూలంగా వెలువడినచో బలవంతులకు వర్తకబృందం సంఘటితపడ్డ కొన్నచో యీచట్టం మారునని యే నమ్ముచున్నాము. ఉత్పత్తి ఎక్కువచేయుటకు ప్రభుత్వంవారు ఎక్కువ కట్టుదిట్టాలుచేసి, పంపకం విధానంలో బోక్కయం కలిగించుకోరాదు.

సహకారోద్యమము, సహకారసంస్థలు సామాన్య వర్తకులకన్న నయమని యిదివర కనుకొనెడివాడను. కాని యిటీవలి అనుభవాన్ని బట్టి అభిప్రాయం మార్చుకొనవలసి వస్తున్నది. ప్రభుత్వంవారు పెట్టరానిచోట తమచేయి పెట్టి అడ్డు వస్తూ ఉండబట్టే వ్యాపారస్థులకు చిక్కులు కల్గుచున్నవి. అక్కరమాలిన వస్త్రాలు జిల్లాలకువచ్చి చెల్లక కొట్లలో మూల్గుచున్నవి. కనుక యీ సభారోదనవలన కంట్రోల్సు తొలగి పరిస్థితులు చక్కబడితే అందరం ధన్యులము." అని శ్రీ విశ్వనాథంగారు తెలిపిరి.

### అధ్యక్షోపన్యాసం

నారాందాస్ జెఠాలియా గారు సభాధ్యక్షత వహించి ప్రభుత్వంవారు వస్త్రాల కంట్రోలు తొలగించిన పిమ్మట తిరిగి తొందరపడి కంట్రోల్సు అమలు జరుపుట తెలివితక్కువయని తమవాలె పరిస్థితులవల్ల రుజువయినదిరి, పంపకంవిధానం మారుటవలన, లైసెన్సురుసుము వేలకు వేలదుగుట వలన అనేకమంది వర్తకులు దెబ్బతిన్నారు. కొన్ని జిల్లాలలో లైసెన్సులు పుచ్చుకొనేవారే దొరక కున్నారు. కనుక కంట్రోలు నియమాలు పూర్తిగ సడలించి వ్యాపారం యథేచ్ఛగ కొనసాగించాలనిరి. సహకారసంఘాలకు ఎక్కువసర కిచ్చేసరికి, అవి వ్యాపారం చేయలేక 19000 బేళ్లు మిగిలిపోయినందున తక్కువధరకు విక్రయించాలని చూస్తున్నారు. ఈ కంట్రోలువల్ల 20% కంటు లాభంలో ప్రభుత్వానికి 4-12-0 పోయి మిగిలింది ఖర్చులకు అయిపోతున్నది. కనుక ఎక్కువలాభం పొందేది ప్రభుత్వమే గాని వర్తకులు కారు. ప్రభుత్వంవారు నియమించిన ధరలు చాల హెచ్చుగా నున్నవి. ఉత్పత్తిదారులు పనికిరాని సరుకు తయారు చేయుచున్నారు. ఇపుడు సరకు నిలిపిగ నుండి కనుక కంట్రోల్సు తొలగించాలి.

"ప్రభుత్వంవారు తలపెట్టిన దొంగ వ్యాపారచట్టాన్ని మర్యాదస్థు లెవ్వరు అంగీకరింపజాలరు. వ్యాపారస్థులను అరుపాక్షలలో నుంచుటకు ప్రస్తుత నియమాలు చాలవా? మొదటి నేరానికే 6 నెలల నుండి 6 సం॥ల వరకు శిక్ష విధించుట వింతగ నున్నది. పైగా ఎన్నోరకాల శిక్షలు వర్తకులకు, పత్రికలకు కూడ యీ చట్టం విధించుచున్నవి".

"మదరాసు ప్రభుత్వం వింత చట్టాలు చేయుచున్నది. దీని శాసనసభ్యులు వింత ప్రకృతి గలవారే. ప్రభుత్వానికి ఉన్న ఇటువంటి అధిక సంఖ్యాకబలంతో యిట్టి విపరీతచట్టాలు చేస్తూవుంటే, యితర రాష్ట్రాలు వాటి ననుసరిస్తూవుంటే యింక అడిగేదా బ్రతుకు? అందుకే శాసనసభలలో ఘట్టి ప్రతికూలపక్షం ఒకటి ఉండాలి. చట్టం అమానుషంగా అతి క్రూరంగా నుంది. కొద్దిమంది దొంగ వ్యాపారస్థులను శిక్షించుటకు యింత కఠిన శాసనం, ద్వేషపూరిత మయినది రాక్షసములో కూడినది చేయ నక్కరలేదు. ఉద్యోగులు యించుక జాగ్రత్తగ నుండి, క్రిమినలు లా చట్టం కొంచెం సవరించి ప్రజాప్రాతినిధ్యంగల ప్రభుత్వం ప్రజల సహకారమును పొందినచో దొంగవ్యాపారం రూపుమాయగలదు. కనుక ప్రభుత్వం వారు ఈచట్టాన్ని వదలుకొని వ్యాపారస్థుల అవమానములనుండి తప్పించగోరెదను" అని దూలియాగారు నుడివిరి.

### తీర్మానాలు

దొంగవ్యాపార నిరోధచట్టము చెన్నరాష్ట్రానికి అపకీర్తి తెచ్చునుగా వున దాన్ని ప్రభుత్వంవారు వదలుకోవలెనని కోరుచును, వదలుకోజాలని పక్షమున, అందుకు సంబంధించిన వ్యాపారస్థులతో సంప్రదించి ఆచరణయోగ్యముగ సవరించాలని కోరుచును, వస్త్ర వ్యాపారస్థులను ఈ చట్టమునుండి మినహాయించాలని కోరుచును తీర్మానములు గావించబడెను.

వస్త్రవ్యాపారం పరిస్థితులు మరినందున లైసెన్సు దరావత్తు మొత్తములు 5000/ నుండి 1000 కి, రూ. 15000 నుండి 300/- లకు తగ్గించవలెనని తీర్మానించబడెను.

వస్త్రాల సరకు మిగిలి పోతున్నందున కంట్రోలు తొలగించాలని, లేదా కంట్రోలు ధరలైన తగ్గించాలని వేరొక తీర్మానం గావించబడెను.

ఎల్. శ్రీనివాసన (ఇండిస్ట్రియల్సు) పి. ఆర్. నమ్మాళ్వారు, ఎస్. రామనాథన (మాజీమంత్రి) పి. ఎం. బాలసుబ్రహ్మణ్యంమదల్యారు, జి. టి. రాజు. ఇ. వి. సుందరరెడ్డి మున్నగువారు తీర్మానములపై ప్రసంగించిరి. బాబులాలు ఎం. మెహతాగారు వందన మర్పించుటతో సభముగిసెను.

## కార్పొరేషన్ కవున్సిల్

మదరాసు, ఏప్రిల్ 17: మదరాసు కార్పొరేషన్ కవున్సిల్ సమావేశము ఏప్రియల్ 19 న సా॥ 5-15 లకు రిప్పన్ భవనములలో జరుగును.

# పేరుమోగిన నిజాం కమ్యూనిస్టు సీతారామరెడ్డి అరెస్టు

## 7 గురి హత్యలకు బాధ్యుడని ఆరోపణ

విజయవాడ, ఏప్రిల్ 16: ఎస్. సీతారామరెడ్డి అనే, పేరుమోగిన నిజాం కమ్యూనిస్టును విజయవాడ తాలూకా పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు భారం ఉమామహేశ్వరరావుగారు ఇచ్చటికి సమీపానగల ఎనికేపాడులో అరెస్టుచేశారు. ఈరెడ్డి నల్లగొండజిల్లా మిర్యాలగూడెంతాలూకా దేవులపల్లె వాస్తవ్యుడు. నాలుగుమాసాలుగా సంస్థాన పోలీసువారికి దొరకకుండా తప్పించుకు తిరుగుతున్నాడు. ఇతడు 7 హత్యలకు బాధ్యుడని ఆరోపణ. ఈ హత్యలకు గురి అయినవారిలో ఇద్దరు గ్రామోద్యోగులు, ఒక కాంగ్రెసువాది కలరని తెలిసింది. (స్వ. వి.)

## బొంబయిలో బరోడాసంస్థాన సమైక్యత

బొంబయి, ఏప్రిల్ 16: బరోడా సంస్థానమును బొంబయి రాష్ట్రంలో సమైక్యం చేయుట లాంఛనప్రాయంగా మే 1-న జరుగుతుంది. సంస్థాన పరిపాలన యాజమాన్యం స్వాధీనము చేసికొనుటవ్రాతం భారతప్రభుత్వంతో సంప్రదింపుల అనంతరం, జులై 1-న జరుగుతుంది. ఈ విషయాన్ని బొంబయి హోంమంత్రి మొరార్జీ దేశాయి నేడువయం పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ వెల్లడించారు.

# ఆంధ్రపత్రిక

## విరోధి సంవత్సరాది సంచిక

ముద్దులొలికే ముఖపత్రంతో, ఉల్లములు రంజింపజేసే రంగు రంగుల చిత్రాలతో పెద్దపెద్దల భావోద్దీపకమైన వ్యాసాలతో, చక్కని మెరుగు కాగితాలతో అందముగా అలంకరించుకొని వెలువడింది.

[కొంతమంది ప్రముఖ వ్యాసకర్తలు]

- శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
- ,, వేలూరి శివరామశాస్త్రి
- ,, పింగళి లక్ష్మీకాంతము
- ,, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి
- ,, నోరి నరసింహశాస్త్రి
- ,, నిడుదవోలు వెంకటరావు
- ,, కాటూరి వెంకటేశ్వరరావు
- ,, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
- ,, తిమ్మావఝ్ఝల కోదండరామయ్య
- ,, బులుసు వెంకటరమణయ్య
- ,, కామఋషి సత్యనారాయణవర్మ
- ,, నిర్వికల్పానందస్వామి
- ,, సత్యనారాయణ శ్రీ 'వాత్సవ'
- ,, బలివాడ కాంతారావు
- ,, కలపటపు రామగోపాలరావు
- ,, మా. గోఖలే
- ,, గోపీచంద్

వెల రెండురూపాయిలు పోస్టేజి ప్రత్యేకము 9 అ.

వి. పి. లు పంపబడవు.

ప్రతులు మీ సమీపమునగల మా ఏజంట్లవద్ద దొరుకును. లేదా, మాకు వ్రాసి తెప్పించుకొనుడు. ప్రతులు పరిమితముగా వేసినాము. త్వరపడి తెప్పించుట మంచిది.

ఆంధ్రపత్రిక: తపాలాపెట్టె నెం. 212: మద్రాసు.

## బళ్లారి జిల్లాలో పరిశ్రమల మంత్రి పర్యటన

### తుంగభద్ర పంట కాల్వ తనిఖీ

బళ్లారి, ఏప్రిల్ 15: రాష్ట్ర రెవిన్యూ, పారిశ్రామిక కార్మిక శాఖలమంత్రి శ్రీ హాలహర్వి సీతారామరెడ్డిగారు గత మూడుదినములుగా బళ్ళారిజిల్లా తూర్పు తాలూకాలలో పర్యటించి, నేడు మదరాసుకు రైలులో వెళ్లిరి. నిన్న మంత్రిగారు కారులో వెళ్లి చింతకుంటనగ్గర తుంగభద్ర పంటకాలువకు నిర్మింపబడు చున్న వంతెనను తనిఖీచేసిరి. వీరి వెంట సూపరింటెండింగ్ ఇంజనీరు ఏకాంబరంగారు, బావుల ప్రత్యేక డిప్యూటీ కలెక్టరు జి. రామిరెడ్డిగారు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు సుబ్రహ్మణ్యంగారు ఉండిరి. బిసలహళ్లి, గొడెహాలు, పర్మదేవన హళ్ళి గ్రామములలో క్రొత్తగా నిర్మితమైనబావులను కూడ మంత్రిగారు తనిఖీచేసిరి. చింతకుంటనుండి, బాపురం మీదుగా పచ్చారపల్లి, సమ్మత గొరిలరకు త్రవ్వబడిన తుంగభద్ర పంటకాల్వను మంత్రిగారు తనిఖీచేసిరి. మధ్యాహ్నం కోకిలతోటలో తమమాతామహుల యింట విడిసి, సాయంకాలం హొసపేటనుండి బళ్ళారికి చేరిరి.

#### ప్రత్తిగింజల ఎగుమతి నిషేధం

బళ్ళారిజిల్లాలో యీ సంవత్సరం ప్రత్తిపంట తక్కువైనప్పటికిని, విరివిగా ప్రత్తిగింజలను ఎగుమతి చేయుట చేత, పసువుల కాహారం కొరతపడెననీ అందుచే 1948లో ఉన్న ప్రత్తిగింజల ఎగుమతి నిషేధమును మరల ప్రవేశపెట్ట వలసిందనీ, మంత్రిగారికి పలువురు విజ్ఞాపన కావించిరి. రాయదుర్గం పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు నాగభూషణంగారు, బళ్ళారివర్తకులు మహాబళేశ్వరప్పగార్లు విజ్ఞాపన దార్ల బృందంలో కలరు.

షాపులుమాస్టాల చట్టంలో కొన్ని సెక్షన్లను తమకు వర్తింపచేయరాదని బళ్ళారి ధరాకీ వర్తకులు మంత్రిగారిని కోరిరి. రాజకీయ బాధితుల సమావేశంలో మంత్రిగారు వారి పరిస్థితులను తెలుసుకొనిరి. మంత్రిగారు నేటిసాయంకాలం రైలులో మద్రాసు వెళ్లిరి.

### రేషనింగు చట్టంకింద శిక్షలు

ప్రొద్దుటూర్కు, ఏప్రిల్, 15: స్థానిక రేషనింగు ఆఫీసరు బి. హెచ్. సూర్యారావుగారు రేషనింగు చట్టమును అతిక్రమించినందుకుగాను దాఖలుచేసిన 8 కేసులను అడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటుగారు విచారించి 7 గురు ముద్దాయిలకు రు 5 మొదలు రు 150 వరకు జరిమానా విధించిరి. చివరికేసునందు షేకుశిలార్ సాహెబ్, కె. ఖాన్‌సాహెబ్ అను ఇరువురు పర్మిట్ లేకుండా రేషనింగు ఉన్న ప్రదేశంలోకి 12 బస్తాల ధాన్యము తెచ్చిన నేరమునకై వారిరువురికిని ఒకమాసం కఠినశిక్ష విధించబడెను.

#### నిడుబ్రోలులో కిరసనాయిలుకొరత

నిడుబ్రోలు, ఏప్రిల్ 15: ఇక్కడ గత ఒకటిన్నర మాసాలనుండి కిరసనాయిలు దొరకక ప్రజలు అమిత యిబ్బంది పడుచున్నారు. అధికార్ల వద్దనుండి కోటాలు రాలేదని ఏజెంట్లు వ్యాపారులు చెప్పుచున్నారు.

### నగరిఫిర్కా ఉపాధ్యాయ సంఘ వార్షికోత్సవం

నగరి, ఏప్రిల్ 15: ఈ ఫిర్కా ఉపాధ్యాయ సంఘం వార్షికోత్సవం జటమంచి కాశీశ్వరరావుగారి అధ్యక్షతను గతవారంలో జరిగెను. సంఘ కార్యదర్శి ఎన్. సుందరరాజ అయ్యంగార్ ప్రతిసెల హరిజనాధ్యక్షత దినోత్సవాలలో ఉపాధ్యాయులు నెరవేర్చవలసిన విధులను గురించి ప్రసంగించిరి. సి.బిల్ గారు గ్రామాభ్యుదయాన్ని గురించి విపులంగా ఒక వ్యాసాన్ని చదివి వినిపించారు. అన్యులు ప్రసంగిస్తూ, ఉపాధ్యాయులు విద్యార్థులలోను నాటవలసిన ఆదర్శాలను గురించి హితవు చెప్పిరి. గోపాలయ్యగారి వందనములతో కార్యక్రమం ముగిసెను.

#### నగరిఫిర్కా అభివృద్ధి కార్యాలయం మార్పు

నగరి, ఏప్రిల్ 15: ఇక్కడ గత మూడు సంవత్సరాలనుండి ఉంటున్న నగరి ఫిర్కా అభివృద్ధి కార్యాలయము నిన్న కార్వేటి నగరం గ్రామానికి మార్చబడెను.

#### చంద్రమాంబా స్మారక పోటీ పందెములు

విశాఖపట్నం, ఏప్రిల్ 12: స్థానిక పాఠశాలలో సిన్నం ఆరాం సత్యనారాయణగారి సతీమణి స్వర్గీయ చంద్రమాంబగారి స్మారకార్థం కలిజంటి సీతారామరావుగారి అధ్యక్షతను బాలికలకు కుట్టు, చిత్రకళ, సంగీతం, వ్యాసరచనలలో పోటీలు జరిపి గెలుపొందినవారికి రజిత పాత్రలు బహూకరించారు.

## ఆంధ్ర జాతీయ కళాశాల

### జులైనుండి ఇంటర్‌మీడియేటు తరగతులు

మచిలీపట్నం, ఏప్రిల్ 15: ఆంధ్ర జాతీయ కళాశాలలో రాబోవు జులై మాసమునుండి లెక్కలు, ఫిజిక్సు, కెమిస్ట్రీ, లెక్కలు, ఫిజిక్సు, మెకానికల్ ఇంజనీరింగు; ఇండియన్‌హిస్టరీ, అడ్వాన్సుడ్ తెలుగు, అడ్వాన్సుడ్ సంస్కృతం; మొదలగు అభిమానశాస్త్రములతో ఇంటర్మీడియేటు తరగతులను ప్రారంభించుటకు కళాశాల పాలక సంఘము, కౌన్సిలువారు నిశ్చయించుకొని అందుకవసరమగుచర్యలు తీసుకొనుచున్నారు. గ్రామాలలో వడ్రంగము, కమ్మరము మొదలగు వృత్తులు చేసుకొనేవారికి సామాన్య విద్య, విజ్ఞాన శాస్త్రము, వృత్తివిద్యలను మేళవించి నేర్పుటకుగాను టెక్నికల్ విద్యాశాల, గ్రామీణ కళాశాలలను పెట్టుటకు గూడ నిర్ణయించిరి. ఆంధ్రదేశంలోకల్ల ప్రాచీనమైనదిన్ని ఉత్తమ యంత్రపరికరములు కలదిన్నీ అగు కళాశాల వర్కుషాపును, ప్రస్తుతదేశావసరముల కనుగుణ్యంగా వ్యవసాయక పారిశ్రామిక వస్తూత్పత్తిని స్వయంపోషక మొనర్చుచూ, విద్యార్థులకు తర్ఫీదు నొసంగుటకుగూడ నిర్ణయించిరి. ఇందుకు అవసరముగుచర్యలు తీసుకొన బడుచున్నవి.

#### రాష్ట్రకళావంతుల సంఘ కార్యవర్గం

మచిలీపట్నం, ఏప్రిల్ 15: ఆంధ్ర రాష్ట్ర కళావంతుల సంఘ కార్యవర్గంవారు యిక్కడ సమావేశమై, 1947 దేవదాసీ చట్టంలో 'భోగము మేళములను నిషేధించవలెను.' అని శ్రీ టి. విశ్వనాథంగారు తెచ్చిన సవరణను, బలపర్చుతూ యిందుకు విరుద్ధంగా భోగం మేళముల జరుపువారిపై తీసుకొను చర్యలకు ప్రాసిక్యూషను ఖర్చులకు రాష్ట్ర కళావంతుల సంఘమునుండి ద్రవ్యమునుఖర్చు పెట్టుటకు తీర్మానించిరి.

#### మంగళగిరి షాపు గుమాస్తాల సంఘం

మంగళగిరి, ఏప్రిల్ 12: స్థానికషాపు గుమాస్తాల సంఘంవారు కాటాబత్తుని నరసింహ స్వామిగారి అధ్యక్షతను సమావేశమై మాచేటి రామలక్ష్మయ్యగారిని అధ్యక్షులుగను, తెనిగంట్ల వెంకటేశ్వర్లుగారిని కార్యదర్శిగను, వనమా చంద్రశేఖరరావుగారిని కోశాధికారిగను ఎన్నుకొనిరి.

### చీరాల పేరాల ఆందోళనలో పాల్గొన్నవారుకూడ రాజకీయబాధితులే

చీరాల, ఏప్రిల్ 16: 1921 సం॥లో శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఆధ్వర్యమున జరిగిన చీరాల మునిసిపల్ ఆందోళనలో పన్నులు చెల్లింపక నిరాకరించిన వారుకూడ (భూములు మంజూరు చేయుటకు) రాజకీయబాధితులుగ పరిగణింపవలెనని ప్రభుత్వం ఉత్తరువు చేసింది. ప్రభుత్వం యీ పట్టణకాంగ్రెస్ అధ్యక్షుని విజ్ఞప్తికి సమాధానమిస్తూ ఇది తెలియజేసింది. ఈ ఉత్తరువు రెవెన్యూ అధికార్లకుకూడ పంపబడినట్లు తెలుస్తోంది.

### మోసం అనుమానంపై అరెస్టు

మచిలీపట్నం, ఏప్రిల్ 15: విజయవాడ వాస్తవ్యుడు పామర్తి ఆంజనేయులు అను నతడు యీ పురపాలక సంఘాధ్యక్షుడు రాళ్ళపల్లి అచ్యుతరామయ్యగారి వద్దకువెళ్ళి గోధుమలు, ఓవల్టిన్ సప్లయి చేసెదననీ, డబ్బు యివ్వవలసిందని అడుగగా అతని వాలకంమీద అనుమానం తగిలి అచ్యుతరామయ్యగారు అతనిని రాబర్టుసన్ పోలీసులకు అప్పగించిరి. విచారణ చేయగా యితడు లోగడ కొంతమందిని యీ విధంగా మోసంచేసినాడని తేలింది. పోలీసులు యింకా దర్యాప్తు చేస్తున్నారు.

### వేటుకూరి వెంకటనర్సయ్యగారికి సన్మానం

తెనాలి, ఏప్రిల్ 16: కవిబ్రహ్మ సన్మాన సంఘ కార్యదర్శి ఆవుల గోపాలకృష్ణమూర్తిగారిట్లు వ్రాసిరి: కవిబ్రహ్మ వేటుకూరి వెంకటనర్సయ్యగారికి ఆంధ్రరాష్ట్రం పౌరుల తరపున గుంటూరులో జూన్‌మాసంలో అఖండ సన్మానం జరుపుటకు అవసరమైన ఏర్పాట్లు చేయుటకై పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరిగారు అధ్యక్షులుగను, ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు కార్యదర్శిగను, రాష్ట్రంలోని వివిధప్రాంతాల ప్రముఖులతో ఒక ఆహ్వానసంఘం ఏర్పాటు చేయబడింది. ఈ సందర్భంలో కవిబ్రహ్మ సన్మాన సంచిక నొకదానిని ప్రకటించుటకు నిర్ణయింపబడినది. కావున కవిపండితులు, పండితులు, కవులు, కొవ్వురకళాకారులు అభిమానులు కవిబ్రహ్మ సాహిత్యాన్ని గురించి పద్యగద్య రచనలు మే 15 లోగా పంపవలెనని కోరుచున్నారు. చిత్రకారులు గూడా పంపవలెనని కోరుచున్నారు.

## రామరాజ్య పరిషత్ సభలు

#### 5 వ రోజు కార్యక్రమం

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 13: రామరాజ్య పరిషత్తు సభల 5 వ రోజు కార్యక్రమము మహిళలచే నిర్వహించబడెను. శ్రీమతి రాప్తాటి సుబ్బమ్మగారు సభ కధ్యక్షత వహించిరి. రామరాజ్యమును గురించి, రామరాజ్యస్థాపన సందర్భంలో మహిళల కర్తవ్యమును గురించి భువనగిరి లక్ష్మీకాంతమ్మ, ఆకుర్తి భాస్కరమ్మగార్లు మాట్లాడిరి.

#### చివరిరోజు కార్యక్రమం

రామరాజ్య పరిషత్తు సభల చివరిరోజు కార్యక్రమానికి నిన్న శ్రీపాలపర్తి బాపయ్యగారు అధ్యక్షత వహించిరి. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు ప్రసంగిస్తూ శ్రీ శక్తేశ్వరు పెరి అనీ, రామరాజ్యం శాంతి సౌభాగ్యాలతో విరాజిల్లుటకు సీతామహాదేవి తోడ్పాటే ముఖ్యకారణమని చెప్పి, యీ దేశంలో రామరాజ్యంవంటి ధర్మరాజ్యం స్థాపింపబడవలెనన్న మహిళలు దీక్షతో కృషిచేయవలెనని చెప్పిరి. అనంతరం లక్కాకరపు వెంకటకృష్ణశాస్త్రి, సన్నేటి సత్యనారాయణ, సోమిన కామేశ్వరరావుగార్లు ప్రసంగించిరి. ఇంతటితో సభలు ముగిసెను.

### బంగనపల్లిలో శిస్తు తగ్గింపు

బంగనపల్లి సంస్థానమున బంగనపల్లి తాలూకాలోని మంగపల్లి, క్రొత్తపల్లి, నరిశపల్లె, కౌనాల, పంజాముల, ఎర్నోని, ముడినోడు, కమలపురి, ఓబ్రతమానుదిన్నె, టంగుటూరు గ్రామాలను 1 వ గ్రూపునుండి రెండవ గ్రూపులోనికి మార్చునని మదరాసు ప్రభుత్వంవారు 4-4-49 తే. సెం 905 జి. ఒ. లో ప్రకటించిరి. దీనివల్ల రూ 4 తరముగల భూమికి రూ 3 తరముగను, రూ 3 తరముగల భూమికి రూ 2 తరముగ రేట్లు తగ్గును. అని స్టేటు కాంగ్రెస్ కార్యదర్శి పి. వెంకటసుబ్బయ్య గారు తెల్పుచున్నారు.

### నిడదవోలులో తపాల బిళ్లల కొరత

నిడదవోలు, ఏప్రిల్ 12: కవర్లుకార్డుల ధర పెరిగినప్పటినుండి యిక్కడ తపాలాఫీసులో కాని, అర్థణా బిళ్లలు దొరుకుటలేదు. ప్రజలు చాల యిబ్బంది పడుచున్నారు.

#### వినుకొండలో తపాలా కార్డుల కొరత

వినుకొండ, ఏప్రిల్ 13: ఈ గ్రామంలో వారం రోజులనుండి కార్డులు లేక ప్రజలు చాల యిబ్బంది పడుచున్నారు. పాతఅర్థణా కార్డులున్నను కాని, బిళ్లలు తపాలా ఆఫీసులో లేవని చెప్పుచున్నారు.

#### హిందుస్తానీ వాగ్వర్ధనీ సభలు

విజయనగరం, ఏప్రిల్ 13: శ్రీ పసుమర్తి వీరభద్ర స్వామిగారి హిందీ పాఠశాల (సరస్వతీ పఠన మందిరమున) ఎ. జి. విశ్వనాథ్‌గారి అధ్యక్షతను హిందూస్తానీ వాగ్వర్ధనీ సభలు ఏర్పాటు చేయబడెను. అనేకమంది విద్యార్థులు విద్యార్థినుల చర్చలలో పాల్గొనిరి. శ్రీ పసుమర్తి వీరభద్ర స్వామిగారు సభలను ప్రారంభించిరి. హిందూస్తానీ విద్యార్థులు కేవలం పరీక్షలు ప్యాసగుట మాత్రమేగాక హిందూస్తానీలో మాట్లాడుట నేర్చుకోవలెను. అని వారు చెప్పిరి.

#### పేదలకు అన్నదానం

నిడదవోలు, ఏప్రిల్ 15: స్థానిక పత్తి కసంఘాధ్యక్షులు గుమ్మలపల్లి బుల్లి కోటయ్యగారు శ్రీరామనవమి కళ్యాణోత్సవం వైభవంగా జరిపి మొన్న సుమారు 1000 మంది బీదప్రజలకు అన్నదానం గావించిరి.

#### గుడివాడ దివ్యజ్ఞానసమాజ స్వర్ణోత్సవం

గుడివాడ, ఏప్రిల్ 11: స్థానిక దివ్యజ్ఞాన సమాజస్వర్ణోత్సవము ఎన్. శ్రీ రాంగారి అధ్యక్షతను మొన్న జరిగెను. ప్రతినిధులకు ఉచిత భోజనవసతులు ఏర్పాటు చేయబడెను స్వర్గీయ గుమ్మలపల్లి గోపాలకృష్ణమూర్తిగారి తాయాచిత్రమును అధ్యక్షులు ఆవిష్కరించిరి. కార్యదర్శి ఎ. వి. కామేశ్వర రావుగారు గత 5 సం॥ల లోను జరిగిన కృషిని వివరించిరి. శాంతి మంత్రపఠనముతో కార్యక్రమం ముగిసెను.

#### పొన్నూరి ఉన్నతపాఠశాల వార్షికోత్సవం

పొన్నూరు, ఏప్రిల్ 15: స్థానిక ఉన్నత పాఠశాల వార్షికోత్సవం రాష్ట్ర మంత్రి శ్రీ ధర్మక్షుర్తులంగారి అధ్యక్షతను జరిగెను. గత మాసమున అష్టావధానంచేసిన పాలకాలాంధ్ర పండితులు శ్రీ చెలా లక్ష్మీనారాయణశాస్త్రిగారికి మంత్రిగారు సువర్ణఘంటాకంకణమును, శిష్యులుగా బహూకరించిరి. రాత్రి పాఠశాలలోఉపాధ్యాయులు బాలురకలిసి విశ్వశాన్తిమంటి, రాణా ప్రతాపసింగ్ కొన్ని అంకములు ప్రదర్శించిరి.

## ఆయుర్వేద "రెడ్‌క్రాస్" సంఘం

### డా॥ లక్ష్మీపతిగారి ప్రకటన

మద్రాసు, ఏప్రిలు 16: బరోడాలో జరిగిన అఖిలభారత ఆయుర్వేదకాంగ్రెసు మహాసభకు వెళ్లిన డా॥ ఆచంటలక్ష్మీపతిగారు నేడు మద్రాసుకు తిరిగి వచ్చి యిట్లు చెప్పిరి:

ఈ పర్యాయము జరిగిన అఖిల భారత ఆయుర్వేద మహాసభ నూతన శకారంభముగా నున్నది. చాలా ముఖ్యమైన నూతన కార్యక్రమములను ఈ సభ నిర్ణయించెను.

(1) గ్రామవైద్యులను ఏర్పాటుచేసి వారి ద్వారా కొందరు వాలంటీరులను ఒక దళముగా సమకూర్చి గ్రామప్రజల ఆరోగ్యాభివృద్ధికి పాటుపడునట్టి రెడ్ క్రాస్ సొసైటీవలె ఈ వాలంటీరు దళముచే పనిచేయించబడును.

(2) గ్రామ ఆరోగ్య విషయములను బోధించెడి పాఠ్యగ్రంథములను తయారు చేయుటకై ఒక కమిటీ ఏర్పాటు చేయబడెను. ఈ కమిటీ డా॥ ఆచంట లక్ష్మీపతిగారు అధ్యక్షులుగా నియమింపబడిరి.

(3) వివిధ వైద్య విధానములను పరిశోధించి వాటిని అన్నింటిని సమన్వయించి సంపుటీకరించుటకు ఒక పండిత మండలిని ఏర్పాటు చేయడమునను. ఇంగ్లీషు వైద్యం, హోమోపతివైద్యం, ప్రకృతి వైద్యం వీని నన్నింటిని పరిశీలించి ఆయుర్వేదములోనికి అనేక ఉత్తమ పద్ధతులను స్వీకరించడమునను. ఆయుర్వేదము నే జాతీయవైద్య విధానముగా చేయడమునను. ఆయుర్వేదవైద్యకళాశాలలకు అక్కరకు వచ్చెడి పాఠ్యగ్రంథములను తయారు చేయుటకు మరొక కమిటీ నియమింపబడెను. బొంబాయి వాసులగు యాదవత్రికం ఆచార్యగారు యీ కమిటీకి అధ్యక్షులు. చోప్రాకమిటీ నివేదిక ఆయుర్వేద పురోవృద్ధికి ఆధారంగా స్వీకరింపబడును. అ. భా. ఆయుర్వేద కాంగ్రెసు శాఖా కార్యాలయం సేవాగ్రామములో ఏర్పాటు చేయబడును.

## జాతీయ వారోత్సవాలు

భీమవరం, ఏప్రిల్ 10: స్థానిక కాంగ్రెస్ యాజమాన్యాన గత వారంలో జాతీయ వారోత్సవం జరుపబడెను. ఈ సందర్భంలో ఆర్. శేషాచలంగారి అధ్యక్షులను బహిరంగ సభ జరిగెను. అనుముల రామగోవింద శర్మగారు జాతీయ వారముల గూర్చి, ప్రస్తుత దేశపరిస్థితుల గూర్చి, కాంగ్రెస్ ప్రభుత్వాలను ప్రజలు బలపర్చవలసిన ఆవశ్యకతను, గూర్చి ప్రసంగించిరి.

నందిగాము తాలూకా కాంగ్రెస్‌సంఘ యాజమాన్యాన 6 తేదీనుండి 9వ తేదీవరకు రేపాలబుచ్చి రామశేషయ్యశ్రేష్ఠి, సూర్యనారాయణ రావు, కె. శ్రీ రామమూర్తిగార్లు నందిగాము, ముప్పాళ, కేతవీరునపాడు, గొర్లపాడు, తోట రావులపాడు, చింతలపాడు, కంచల గ్రామాల్లో పర్యటించి జాతీయ వారోత్సవాల సందర్భాన బహిరంగ సభలుజరిపి జాతీయ వారప్రాముఖ్యత, గాంధినిధి సేకరణావశ్యకతలను గురించి ఉపన్యసించిరి. ప్రజలందరు కాంగ్రెస్ ప్రభుత్వాలను బలపర్చవలసిన ఆవశ్యకతను ప్రబోధించారు.

### ధాన్య సేకరణాధికార్లకు ప్రభుత్వ సూచన

నిడుబ్రోలు, ఏప్రిల్ 10: ఫేమా చేయబడిన ధాన్యపు కొట్లలోని ధాన్యమును సేకరించినపుడు, బ్యాంకులతో ఎట్టివివాదములు గాకుండా వారితో సహకరించవలసిందిగా ధాన్య సేకరణాధికార్లకు ప్రభుత్వంవారు కొన్ని సూచనలు పంపినట్లు తెలియుచున్నది. ప్రకటింపబడిన దానికంటె ఎక్కువ ధాన్యం ఉన్నదని అనుమానించి సవ్వడు యిటువంటి వివాదాలు వస్తున్నవనీ, దీనివలన కాలహరణం జరుగుచున్నదనీ, చెప్పుచున్నారు. (స్వ. వి.)

#### అనంతపురం మండలోపాధ్యాయ సంఘ వార్షికోత్సవం

అనంతపురం, ఏప్రిల్ 12: ఈ జిల్లా ఉపాధ్యాయ సంఘవార్షికోత్సవం ఎస్. బాలకృష్ణ జోషిగారి అధ్యక్షతను గతవారంలో యిక్కడజరిగెను. జిల్లా అన్ని కేంద్రాలనుండి ఉపాధ్యాయులువచ్చిరి. శ్రీ కల్లూరి సుబ్బారావు (ఎం. ఎల్. ఏ) గారు మహాసభను ప్రారంభించిరి.

ఉపాధ్యాయుల కర్తవ్యమునుగురించి సుబ్బారావుగారు ప్రసంగించిరి. అన్యులు ప్రసంగించిన అనంతరం కొన్ని తీర్మానాలు చేయబడెను. క్రొత్త సంవత్సరానికి అధ్యక్షులుగా టి. ఎస్. రాజగోపాల అయ్యర్, కార్యదర్శిగా వి. రాఘవాచారిగార్లు ఎన్నికైరి.

#### శ్రీ త్యాగరాజస్వామి సప్తమ వార్షికోత్సవం

తిరుపతి, ఏప్రిల్ 13: నేటి దినం శ్రీ త్యాగరాజస్వామి సప్తమవార్షికోత్సవం నేడు యిక్కడ ప్రారంభమయ్యెను. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రారంభోపన్యాసంచేసిరి.

## అర్చకుల ఇనాములు

### తొలగించుటపై హైకోర్టు సూచనలు

మదరాసు, ఏప్రిల్ 16: దేవాలయముల అర్చకులను వారి సర్వీసు ఇనాం భూములనుండి తొలగించునపుడు ట్రస్టీలు అనుసరించవలసిన విధానంగూర్చి న్యాయసమ్మతమగు సక్రమపద్ధతి ఒకటి ఉండాలి. అన్నిచోట్ల అర్చకుల హక్కులగూర్చి ఒకేరీతి నిర్ణయం అమలు జరగాలి. అని హైకోర్టు న్యాయమూర్తి మాకుగారు, సుమవారంనాడు కర్నూలుజిల్లా రివిజను పిటీషనులో తీర్పుచెపుతూ నుడివిరి.

కర్నూలుజిల్లాలో హాటెవరంలోని శ్రీ వినాయకస్వామి దేవాలయం అర్చకులు అనుభవించుచున్న ఇనాం భూములను తమకు ఒప్పగించుమని హిం. ధ. చట్టం 78 సెక్షను ప్రకారం ట్రస్టీలు జిల్లాకోర్టులో దావా చేయగ, జిల్లాజడ్జీ అంగీకరించెను. దానిపై హైకోర్టులో రివిజను పిటిషను దాఖలు చేయబడెను. న్యాయమూర్తి హిం. ధ. బోర్డువారికి నోటీసు పంపి, ఉభయపక్షాలవాదము విన్నాక తీర్పుచెప్పుచు, అర్చకులలో ఒకరిని ట్రస్టీలు అర్చకుని ఉద్యోగమునందుంచి, కొన్ని భూములు అతనికిచ్చి, మిగిలినవి ట్రస్టీల కిప్పించి, మిగిలిన అర్చకులకు నష్టపరిహారమివ్వాలని జడ్జీగారుతీర్మానించిరి. ఈ తీర్పు అర్చకులకు, బోర్డుకు, ట్రస్టీలకు సంతృప్తికరంగా నుండెను.

జడ్జీగారు తీర్పులో ఇట్లు తెలిపిరి:-

ఇటువంటి కేసులు అనేక కోర్టులకు వస్తున్నాయి. అర్చకులను వారి ఉద్యోగం నుండి తీసివేయుటగాని సస్పెండు చేయుటగాని చేయకుండానే కోర్టులో కాగితం పడేసి వారు తరాలనుండి అనుభవిస్తున్న భూములు ట్రస్టీలు తీసుకోదలచుచున్నారు. అర్చకులుసర్వీసుతృప్తిగా చేయలేదనే అపవాదైనా లేకుండా వారి ఇనాములు తీసుకుంటున్నారు. ఇట్టి సందర్భంలో ముందు చేయవలసిందేమంటే, అర్చకులకుటుంబంలో చాలమంది యున్నచో, యిపుడున్న చట్టంప్రకారమే అందరిలో ఒకరిని అర్చకునిగా ట్రస్టీలు కోరాలి. అర్చకులే తమలో తాము ఒకరిని ఎంచుకొని ఆ ఉద్యోగానికి ఒప్పగించి, తక్కినవారు తప్పుకోవాలి. అట్లా ఏకీభవించలేనపుడు ట్రస్టీలే ఒకరిని ఎంచుకొని అతనినే శాశ్వతునిగా చేయాలి.

"హిం. ధ. చట్టం 78 సెక్షను ప్రకారం అర్చకులను తొలగించుచు కోర్టులు తీర్పులు సులభంగా చెప్పుచున్నవి. ఈ సెక్షనే నేటి దావాలకు యిన్ని చిక్కులకు కారణమగుచున్నది. భూములు దేవునివైనా అయినా, అర్చకులు 1830 నుండి కొందరు తరతరాలనుండి అనుభవించుచున్నారు. అర్చకులను తొలగించునపుడు హిం. ధ. బోర్డువారు వారికా భూములపై వచ్చు రాబడికి తగు నష్టపరిహారం నగదుయిస్తూ, బాలములనుండి తొలగించే నోటీసు యివ్వాలి. ఈ మూల్యము న్యాయంగా తగినంతగ లేకున్నచో కోర్టువారు అర్చకులను తొలగించుచు తీర్పు చెప్ప నక్కరలేదు. ఇపుడున్న పద్ధతిలో అర్చకులు భావిస్థితికి వెరచి ఎట్లయినా భూములు నిలపెట్టుకోవాలని తంటాలు పడుచున్నారు. వారికి నష్టపరిహారం లభించుననే నమ్మకం ఉన్నచో ట్రస్టీలకు అర్చకులకు ఒడంబడిక కుదరదంటేలో చిక్కులుండవు." అని జడ్జి మాకుగారు తీర్పుచెప్పి, వైవిధంగా కేసులు పరిష్కారం కావాలని సూచించిరి. ఈ కేసు పరిష్కరించుటలో బోర్డు తరపున వాదించిన అడ్వకేటు జనరలుగారెంతయు తోడ్పడిరని తెలిపిరి.

పి. చంద్రారెడ్డిగారు అర్చకులతరపున, జి. గోపాలస్వామిగారు ట్రస్టీల తరఫున వాదించిరి.

#### హిందూ కాలేజీ హైస్కూలు విద్యార్థి సంఘ వార్షికోత్సవం

గుంటూరు, ఏప్రిల్ 15: స్థానిక హిందూ కాలేజీ హైస్కూలు విద్యార్థి సంఘ వార్షికోత్సవం శ్రీ దేశిరాజు హనుమంతరావు గారి అధ్యక్షతను మొన్న జరిగింది. మిన్నకంటి సుబ్రహ్మణ్య శర్మగారి శిష్యుడు కోట్ల కృష్ణారావు అను విద్యార్థి అష్టావధానం చేసెను. సాయంకాలం జిల్లాకలెక్టరు శ్రీ టి. ప్రభాకరరావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. విద్యార్థులందరు సుశిక్షితులై పెద్దలయెడ గౌరవ భావంతో ఉండి విద్యనభ్యసించవలసిందని ప్రభాకరరావుగారు విద్యార్థులకు హితవు చెప్పిరి. కలెక్టరు సతీమణి బహుమతులు పంచిపెట్టెను. అనంతరం శ్రీకృష్ణరాయబారం అను ఏంకాంకనాటిక, బాలాజీ బుర్రకథ ప్రదర్శింపబడినవి.

#### రామచంద్రపురం క్లబ్బు వార్షికోత్సవం

రామచంద్రపురం, ఏప్రిల్ 15: స్థానిక రామచంద్రపురం క్లబ్బు వార్షికోత్సవం గతవారంలో జరుపబడినది. సాయంకాలం జరిగిన సభలో రాజా కాకర్లపూడి రామచంద్రరాజుగారు అధ్యక్షులుగను, చేపూలపల్లి పద్మనాభశాస్త్రిగారు కార్యదర్శిగను ఎన్నుకోబడిరి.

# చెన్నపట్నం విషయంలో నాయకత్రయ నిర్ణయం అసమంజసం

## భాషారాష్ట్ర నివేదికపై ఆంధ్రప్రముఖుల విమర్శ

### కొండ వెంకటప్పయ్యగారి ప్రకటన

భాషారాష్ట్ర సమస్యను గురించి అగ్ర నాయకత్రయం సమర్పించిన నివేదికపై ప్రసిద్ధ ఆంధ్రకాంగ్రెస్ నాయకులు దేశభక్త శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులు గారి కింది ప్రకటన గావించిరి.

భాషారాష్ట్ర సమస్యను గురించి నాయకత్రయ నివేదిక దేశమంతటా నిరాశ కలిగించింది. భాషారాష్ట్ర నిర్మాణసమస్యను యిది తిరిగి అసలు భాషారాష్ట్ర నిర్మాణం వాంఛనీయమా కాదా అన్న ఆరంభదశకు తీసుకొనిపోయింది. ప్రస్తుతం దేశంలో సాగుచున్న ఏకీకరణ కార్యక్రమానికి భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు నిర్మాణం చేయబడటం అంతరాయం కలిగించి దేశక్షేమాన్ని భంగం చేయునని వారు అభిప్రాయపడుచున్నారు. వారు దీనిని రహస్యంగా ఉంచలేదు. భాషారాష్ట్ర నిర్మాణం విషయమై వారు నివేదికలో తెలియజేసిన నిర్ణయాలకు రావటానికి యిదే ప్రముఖ కారణం. ఆంధ్రులు గనక రాష్ట్రం కావాలని వాంఛించితే చెన్నపట్నంపై హక్కు వదలుకోవాలని చెప్పటం, అసలు సమస్య తీవ్రత్వాన్ని ఘటం కలిగించింది.

చెన్నపట్నంపై తమకు హక్కు ఉన్నదని ఆంధ్రులు చెప్పినప్పటికీ, దీనినిబట్టి, ఇరుపక్షాలవాదాలను న్యాయదృష్టితో పరిశీలించి నిష్పాక్షికంగా చేయు నిర్ణయానికి వారు బద్ధులై ఉంటారని చెప్పటకు వీలు లేదు. "ఆంధ్రరాష్ట్రంలో వివాదగ్రస్తంగా లేని అందరు అంగీకరించిన ప్రాంతాలతో రాష్ట్రంలోని యితరులయిష్టంమీద ఆంధ్రరాష్ట్రం నిర్మించబడవచ్చును." అని వారు తమనివేదికలో తెలియజేసిరి. ఇది బ్రిటిషువారినీతిని స్ఫురింపజేస్తోంది. దేశంలోని శక్తులన్నీ ఒకసంస్కరణవిధానం పట్ల అభిమానంగా ఉన్నచో మేము దానిని అమలు జరుపుటకు సిద్ధంగా ఉన్నాము. అని బ్రిటిషువారు చెప్పుచుండేవారు. నాయకత్రయంవారి యీ నిర్ణయంలో న్యాయం ఎంతవరకున్నదో అర్థంచేసుకోవటం కష్టంగా ఉంది. ఎందుచేతనంటే వివాదగ్రస్తంగా ఉన్న హక్కులనుగురించి యిప్పుడు తమలో తాము ఒక పరిష్కారానికి రావటం జరుగుతుందని అనుకోవటం నిష్ప్రయోజనం. ఇంకో విషయం, నూతన ఆంధ్రరాష్ట్ర సరిహద్దులు ప్రస్తుత మదరాసురాష్ట్రానికే పరిమితంగా ఉండాలని వారు చెప్పారు. దీనినిబట్టి ప్రస్తుత మదరాసు రాష్ట్రానికి ప్రక్కలనున్న రాష్ట్రాలలోను సంస్థానాలలోను గల ఆంధ్రప్రాంతాలపై, ఆంధ్రులకు గల అన్ని హక్కులకు అరికట్టారన్నమాట.

ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా మదరాసు రాష్ట్రంలో తెలుగు మాట్లాడే 11 జిల్లాలను కలిపి రాష్ట్రంగా ఏర్పాటు చేసి, చుట్టుప్రక్కల ప్రాంతాలనుగురించి తర్వాత నిర్ణయించుకోవచ్చని కొంతమంది అభిప్రాయపడవచ్చును. కాని యీ సరిహద్దు ప్రాంతాలనుగురించి యుక్తమైన కాలంలో వాటి యోగ్యతలను బట్టి న్యాయంగా పరిష్కారం చేయటం జరుగునని హామీయిచ్చినచో మేమరతుగా ఆంధ్రులు తమ హక్కులను వదలుకొనటకు సిద్ధంగా లేరని స్పష్టం చెయ్యవలసియున్నది. "కొంతకాలం తర్వాత మార్పు లేవీ జరగరాదని మేము కొట్టివేయటం లేదు." అని వారు తెలియజేశారు. కాని ఇది స్పష్టంగా లేదనటంలో సందేహం ఏమాత్రంలేదు. ఇది ఆంధ్రుల హక్కులను గురించి న్యాయంగా పరిశీలన జరిపి నిర్ణయం చేయటం జరుగునని నిర్దిష్టమైన హామీనిచేనిని యివ్వటం లేదు. ఇటువంటి విషయాలను ఒక వ్యక్తి యొక్కగాని, వ్యక్తులయొక్కగాని (వారెంత ఉన్నతపదవులలో నున్నప్పటికీ) అభీష్టానికి వదలి వేయటం యుక్తం కాదు. ఈ నివేదిక మీద ఆధారపడి, దానిలో సూచించిన విధంగా రాష్ట్రనిర్మాణానికి ఒప్పుకోవటం అనాలోచితం. ఇటువంటి అస్పష్టవాక్యాల మీద ఎక్కువగా ఆధారపడరాదు. ఈ కమిటీవారు వాస్తవంగా ఆంధ్రుల హక్కులను గురించి ఆలోచించదలచినట్లయితే, ఆకాలంలో దీనినిగురించి తిరుపరిశీలన జరిపెదమని వారు హామీ నిచ్చియుండవలసింది.

ఈ సమస్యా పరిష్కారాన్ని అనిశ్చితంగా వాయిదా వేయరాదు. వివాదాలను అంతం చేసి, అందరు ఆమోదించగల ఒక నిర్ణయం చేయుటకు, వెంటనే తగు చర్యతీసుకోవలెను. ఈ సమస్యా పరిష్కారానికి ఒక్కటే మార్గం. హైకోర్టు జడ్జీలవంటి ఉన్నతపదవులలో నున్న వారితో ఒక మధ్యవర్తిత్వ సంఘాన్ని నియమించి, వివాదగ్రస్తమైన విషయాలనుగురించి న్యాయంగా పరిశీలన జరిపి తమకు న్యాయమని తోచినదానిని నిర్ణయించే స్వేచ్ఛ వారికొసంగవలెను. మదరాసు విషయంలో దానిని ఏదో ఒక రాష్ట్రానికి సంపూర్ణంగా గాని వారిమధ్య విభాగం చెయ్యటంగాని, లేక ఒక ప్రత్యేక ప్రాంతంగా నిర్ణయించుటగాని చేయు అధికారం వారికుండవలెను.

### విశాఖపట్నం న్యాయవాదుల అభిప్రాయం

విశాఖపట్నం న్యాయవాదుల సంఘం వారు గతవారంలో సమావేశమై భాషారాష్ట్ర నిర్మాణ సమస్యపై అగ్రనాయకత్రయం సమర్పించిన నివేదికను గురించి యీ కింది తీర్మానాలు చేసిరి. నివేదికలో సూచించబడిన విధంగా ఉత్తరాన దక్షిణాన ఇంకా యితర చోట్ల గల తెలుగుప్రాంతాలపై ఆంధ్రుల హక్కులను వదులుకోవటానికి వలనుపడదని యీ సంఘం అభిప్రాయపడుచున్నది. ఇంతే కాక ఒకసారి వదులుకొన్న హక్కులను గురించి అధికప్రాముఖ్యమిచ్చి పునః పరిశీలన జరుగుట సాధ్య పడదు కాబట్టి, వాటి పునః పరిశీలన జరుపబడునన్న సూచనకూడ సమర్థనీయంగా లేదు. అందుచే ఆంధ్రప్రాంతాలని నిర్ణయం జరిగిన ఆమోదింపబడిన ప్రాంతాలతో రాష్ట్రాన్ని నిర్మిస్తూ, దానితోబాటు వివాదగ్రస్తంగా ఉన్న ప్రాంతాలపై హక్కులు నిర్ణయం చెయ్యటానికి ఒక సంఘం నియమింపబడవలెనని యీ సంఘం అభిప్రాయపడుచున్నది. ప్రస్తుతానికి మాత్రం జనాభా ఎక్కువగా నున్నదనే కారణం చేత తెలుగు ప్రాంతం తమిళ ప్రాంతం కానేరదు. ఏ ప్రాంతాన్ని గురించైనా నిర్ణయం చెయ్యగలవి చారిత్రక ప్రమాణాలే. మదరాసునగరం మొట్టమొదటి నుంచి తెలుగువారిది. తెలుగువారి కృషి ఫలితంగానే అది యింత మహానగరంగా తయారైంది. గత 30 సంవత్సరాల నుండే అక్కడ తమిళులజనాభా పెరగజొచ్చింది. ఈ పరిస్థితులలో మదరాసు నగరంపై ఆంధ్రులకు గల హక్కులను వదలుకోవటానికి వలనుపడదు. మదరాసు నగరాన్ని గురించి నివేదికలో సూచింపబడిన అంశం సమంజసంగాలేదు. ఆంధ్రరాష్ట్రంయొక్క ముఖ్యపట్టణం మదరాసులో ఏర్పాటు చేయబడవలెనని యీ సంఘం అభిప్రాయపడుతోంది. ఈ షరతులు నెరవేర్చబడనిదే నివేదికలోని సిఫార్సులు అమలు జరపటానికి వీలులేదు.

### జి.వి. పున్నయ్య శాస్త్రిగారి ప్రకటన

భాషారాష్ట్రనిర్మాణ సమస్యనుగురించి పట్టాభి-నెహ్రూ-పటేల్ కమిటీ నివేదికపై ఆంధ్రమహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రిగారి క్రింది ప్రకటనచేసిరి.

భాషారాష్ట్ర నిర్మాణసమస్యను గురించి అగ్రనాయకత్రయ సంఘంచే తయారుచేయబడి, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీచే ఆమోదింపబడిన నివేదిక దార్ కమిషన్ నివేదికకు ప్రతిబింబంగానే ఉన్నది. దక్షిణభారతదేశాన్ని ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర, కేరళ అను నాలుగు నూతన రాష్ట్రాలకింద విభజించవలసిన అవశ్యకతను మాత్రం యీ కమిటీవారు సమర్థించినారు. బహుభాషానిలయాలైన బొంబాయి, మదరాసు నగరాలలో మదరాసును బొంబాయివలె 'సమష్టి నగరం'గా కూడ వీరు నిర్ణయం చేయలేదు. బొంబాయి ప్రాముఖ్యం అతిశయోక్తిగా చెప్పబడింది. మదరాసు కేవలం రాష్ట్ర ప్రాముఖ్యంగల ఒక నగరంగామాత్రమే పేర్కొనబడింది.

చరిత్రదృష్ట్యా మదరాసు తెలుగు నగరము. ఇటీవల కొన్ని సంవత్సరములనుండీ అక్కడ తమిళ ప్రాబల్యం హెచ్చుటం ప్రారంభించింది. ఈ విధంగా అది తెలుగు తమిళ ప్రాబల్యంగల నగరంగా తయారైంది. ఇంతేగాక అక్కడ మళయాళీలు, కర్నాటకులు మొదలైనవారుకూడ ఉన్నారు. బొంబాయికీ, మదరాసుకు భేదం చూపించటం పూర్తిగా పక్షపాతంతో కూడుకొన్నది. కొన్ని లక్షలమంది తమ సోదరాంధ్రులు వేరొక భాషాప్రాంత ప్రభుత్వంకిందకు పోవటం ఆంధ్రులెంతమాత్రం అంగీకరించరు. దీనిని వారు శక్తికొలది ప్రతిఘటించెదరు. రాజీమార్గంగా, మదరాసు నగరాన్ని పరిసరాలతో కలిసి, బొంబాయివలె ఒక ప్రత్యేక రాజకీయ ప్రాంతంగా ఉంచవలెనని ఆంధ్రులు సూచించుతూ వచ్చారు.

ప్రస్తుతానికి మదరాసుపైన, కర్నాటక ఒరిస్సా సరిహద్దులలో తగాదాలుగా ఉన్నప్రాంతాలపైన ఆంధ్రులు తమహక్కును వదలుకొన్నపక్షంలో ఆంధ్రరాష్ట్రాన్ని వెంటనే ఏర్పాటుచేయుటకు యీ కమిటీవారు అంగీకరించారు. ఇది కొంతలోకొంత మెరుగు. తర్వాత కొంత కాలానికి కర్నాటక, కేరళ రాష్ట్రాలు ఏర్పాటు చేయబడునప్పుడు, మదరాసు నగరానికి సంబంధించిన సమస్యను తిరిగి తీసుకొనిరాకూడదని నివేదిక నిర్ణయించలేదు. తమిళులు కూడ తమరాష్ట్రంయొక్క ప్రధానకేంద్రము ఒకమూల ఉండటానికి అంగీకరించకపోవచ్చును. కాబట్టి, మదరాసునుండి ఆంధ్రరాష్ట్రం వేరుచేయబడుటతో, రాజ్యాంగపరిషత్తు బొంబాయివలె మదరాసునుగూడ 'సమష్టి నగరం'గా నిర్ణయించవలెను. ఈలోగా ఆంధ్రరాష్ట్ర ముఖ్యపట్టణాన్ని, మదరాసు రాజధానిలోని ఇతరరాష్ట్రాల ముఖ్యపట్టణాలను మదరాసు నగరంలోనే ఉంచుటకు అనుమతించవలెను. సంపూర్ణమైనదిగాని, అసంపూర్ణమైనదిగాని మొత్తం మీద ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటు చేయబడవలెను. ఇది నా వ్యక్తిగత అభిప్రాయం. దీనితర్వాత విశాలాంధ్ర నిర్మాణానికి అంటే తెలంగాణాలోని 8 జిల్లాలు, ప్రస్తుత మైసూరు సంస్థానంలోని కోలారు, తుంకూరు జిల్లాలు, బస్తరుసంస్థానంలోని కొన్ని భాగాలు, ప్రస్తుత సి. పి. రాష్ట్రంలోని చాందా, భోటానాగపూర్ జిల్లాలతోకూడిన మహాంధ్రనిర్మాణానికి కృషిచేయవచ్చును. మనకివ్వబడేం దాన్ని, అది మనఅభిప్రాయాలకంటే చాలతక్కువగా నున్నప్పటికీ, వద్దని తిరస్కరించటం యుక్తంకాదు.

### డా॥ పట్టాభి ప్రకటనపై విమర్శ

హుబ్లీ, ఏప్రిల్ 14: ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ముందుగా సాగించుకొని పోవలసిందని అనేకమంది కర్నాటక నాయకులు తనకు ఊతం ఇచ్చినట్లుగా రాష్ట్రపతి డా॥ పట్టాభిగారు చేసిన ప్రకటనను గురించి తాను దర్యాప్తుచేయగా, ఏ కర్నాటక నాయకుడు అట్లు ప్రోత్సాహం ఇవ్వలేదని తేలిందనీ ఆ విధంగా తనకు ఊతం ఇచ్చిన నాయకులపేర్లు ఏమిటో డా॥ పట్టాభిగారు బైటపెట్టి ఉండవలసిందనీ కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శి వి. టి. మాగడీ నేడొక ప్రకటన చేసిను.

### తూర్పు కృష్ణాజిల్లా రైతుకాంగ్రెస్

మచిలీపట్నం, ఏప్రిల్ 15: తూర్పు కృష్ణాజిల్లా రైతుకాంగ్రెస్ కార్యవర్గ సమావేశం మొన్న కానూరి చినవెంకట దాసయ్యగారి అధ్యక్షతను యిక్కడజరిగెను. నల్ల మోతుపంగదాసుగారి అకాల మరణానికి సంతాపం తెలియజేస్తూ వారి కుటుంబానికి సానుభూతిని వెల్లడిస్తూ ఒక తీర్మానంచేసిరి. దివితాలూకా కోడూరి గ్రామంలో యీనెల 2న జరిగిన పోలీసు కాల్పులనుగురించి విచారించి నివేదిక సమర్పించుటకు ఒకఉపసంఘమును నియమించిరి.

### శారదా పాఠశాల స్వర్ణోత్సవం

హిందూపురం, ఏప్రిల్ 15: ఇక్కడ సుమారు 52 సం॥ల నుండి ప్రాథమికవిద్యా ప్రచారం చేస్తున్న శ్రీ శారదా పాఠశాల స్వర్ణోత్సవం, అనంతపురం సాయిబాబా జాతీయోన్నత పాఠశాల స్థాపకులు శ్రీ శిరివరం ఆదినారాయణ రావుగారి అధ్యక్షతను వైభవంగా జరిగింది. ఆ సందర్భమున జరిగినసభను టి. వి. వరదాచార్యులుగారు ప్రారంభిస్తూ, పాఠశాలయొక్క ఉన్నత ఆశయాలను, 50 సం॥ల నుండి చేయుచున్న విద్యావ్యాప్తిని గురించి విపులంగా ప్రసంగించిరి. అధ్యక్షులు ప్రసంగిస్తూ, శారదాపాఠశాలను మాధ్యమిక పాఠశాలగ సాధ్యమైనంత త్వరలో చేయుటకు ప్రయత్నించాలనిరి. అనంతరం డి. సూర్యనారాయణరావు, జి.మృత్యుంజయశాస్త్రి శ్రీమతి పంకజమ్మ, సుబ్బారావుగార్లు ప్రసంగించిరి.

### కడపరామకృష్ణ ఉన్నతపాఠశాల

కడప, ఏప్రిల్ 16: స్థానిక రామకృష్ణ ఉన్నతపాఠశాల సాహిత్యసభ వార్షికోత్సవము గతవారంలో జరిగెను. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ జనమంచి వెంకట సుబ్రహ్మణ్యశర్మగార్లు ఉపన్యాసములు చేసిరి. టి. ఎం. శేషాద్రిగారు అధ్యక్షతవహించిరి.

## కొచ్చిన్ - తిరువాన్కూర్ ఏకీకరణ

### పటేల్‌తో తిరువాన్కూర్ మహారాజా చర్చలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: తిరువాన్కూర్, కొచిన్‌ల ఏకీకరణమునకు సంబంధించిన కొన్ని అంశముల భారతప్రభుత్వ సంస్థానశాఖతో చర్చించుటకై తిరువాన్కూర్ మహారాజా ప్రస్తుతం ఇచ్చట ఉన్నారు. ఆయన నేడు సర్దార్ పటేల్ ఇంటిలో ఆయనతో విందారగించెను.

తిరువాన్కూర్ సంస్థాన భవిష్యత్ వ్యవస్థనుగురించి మాత్రమేకాక తనకిచ్చు భరణమునుగురించికూడా ఆయన చర్చలు జరుపునని తెలుస్తున్నది. ఆయన సోమవారంనాడు తిరువాన్కూరుకు పడతారని తెలుస్తున్నది.

### బరోడా కలయికకు అసమ్మతి

### గవర్నరు జనరలుకు విన్నపం

బరోడా, ఏప్రిల్ 15: బరోడా సంస్థానమును బొంబాయిలో కలిపివేయుటకు అసమ్మతి దెలుపు మహాజరు నొకదానిని బరోడా సంస్థానపౌరులు 2,600 మంది గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారికి పంపియున్నారని నేడు తెలియవచ్చెను.

బొంబాయిని బరోడాలోకలిపి వేయుట రాజ్యాంగ విధానమునకు, న్యాయశాస్త్రమునకు విరుద్ధమని మహాజరు తెలుపుచున్నది. గత సంవత్సరము బరోడా మహారాజు ప్రకటించిన సంస్కరణల ననుసరించి ప్రజాప్రతినిధులందరు ఎన్నుకొను బరోడాశాసనసభకు ఈ విషయమును వదలివేయవలెనని మహాజరు కోరుచున్నది.

బరోడా ప్రజాసంఘము ఈ మహాజరులో సంతకములు చేయించుచుండిరి. సంస్థానమును బొంబాయి రాష్ట్రములో కలిపివేయ మహారాజు గావించిన నిర్ణయమును రద్దుచేయవలెనని ప్రార్థించుచు ఈ ప్రజాసంఘమువారు ఫెడరల్ కోర్టులో దావా దాఖలు చేయుచున్నారని తెలియుచున్నది.

### 'దోహసార్' సంగ్రహప్రదర్శనం

లక్నో, ఏప్రిల్ 14: యు. పి. హిందీ సాహిత్య సమ్మేళనంవారు తమ వార్షిక సమావేశంలో 300 ప్రాచీన లిఖిత పుస్తకములను ప్రదర్శనమునకు పెట్టుచున్నారు. షాజహాన్ కుమారుడైన దారాషికో సంపాదించిన "దోహసార్ సంగ్రహ్" అనే హిందీ పుస్తకముయొక్క వ్రాత ప్రతి, ఒక పురాతన ఆయుర్వేద గ్రంథము, మాలిక్ మహమ్మద్ అయాసీ వ్రాసిన పద్మావతి అనే 16 వ శతాబ్దపు పురాణగ్రంథము ఈ ప్రదర్శనలో కానవచ్చును.

### కళా కేంద్రం

చెన్నపట్నం, ఏప్రిల్ 15: కళా కేంద్రం యాజమాన్యాన నెల్లూరు ఆర్ట్సు థియేటరువారు 'ఇదా ప్రపంచం' అనే సాంఘిక నాటకాన్ని ఎగ్మూరు మ్యూజియం థియేటరులో మదరాసు కమిషనరు శ్రీ సి. నరసింహంగారి అధ్యక్షతను ప్రదర్శించారు. నటీనటులు తమ పాత్రలను అతి నైపుణ్యంతో నిర్వహించి ప్రేక్షకుల మన్ననల బొందిరి.

### హార్బర్ అభివృద్ధి స్కీము

మదరాసు, ఏప్రిల్ 16: మదరాసు హార్బరును దక్షిణముఖముగ అభివృద్ధిచేయు కార్యక్రమము ఈ ఏడాదిలోపుగ ప్రారంభముకావచ్చని రైల్వేల ఉపమంత్రి శ్రీ కె. సంతానం పత్రికా విలేఖరులతో చెప్పిరి.

ఈస్కీమునకు 5 కోట్ల రూపాయలు వ్యయమగుననియు నిర్మాణము 4 లేక 5 సం॥ పట్టవచ్చునియు ఉపమంత్రి తెలిపెను. దక్షిణ ముఖముగ హార్బరును పెంచుట వలన సెక్రటేరియటుకు ఏమీ దెబ్బ తగలదు అని చెప్పిరి.

ఉదయం శ్రీ సంతానం మదరాసు పోర్టు ట్రస్టు అధ్యక్షుడు మిస్టర్ జి. పి. అలెగ్జాండరును యం. యస్. యం. రైల్వే కార్యాలయములో కలుసుకొని హార్బరు అభివృద్ధిస్కీమును చర్చించిరి.

### ప్రమాదం

బకింగ్ హాంమిల్సు పనివాడు బి. మునుస్వామి అనువాడు శనివారంఉదయం బేసిన్‌బ్రిడ్జివద్ద రైలుక్రిందపడిచనిపోయెను. వారంరోజులుగా రాత్రిడ్యూటీ చేయుచున్న రాత్రి పనికిపోలేదు.

మారి (9) అను బాలుడు శనివారం ఉదయం జనరలు ఆస్పత్రిలో గజ్జికి మందు పుచ్చుకొని బయటకు రాగా గవర్నమెంటు బస్సుక్రిందపడి వెంటనే చనిపోయెను.

అబ్దులుకాదరు (22) అను కాళహస్తి నివాసి అంగప్పనాయకువీధిలో ఇనుప గొట్టాలు దొంగిలించినందులకు అరెస్టు చేయబడెను.



Edited Printed & Published by S. Sambhu Prasad at the ndhra Patrika Press
No 7, Thambu Chetty St., G. T. Madras.